గీ. నూటనలువదియైదంచును దగువెఱ్ఱి, పుడుకకో తడకకో వాఁడుపుట్ట నతివ
విడిచి దేశాంతరముపోవు విభునికతన, నిత్యసౌభాగ్యవతి యగు నెలఁతఁ బట్టి. ౧౪౫
గీ. నూటనలువదియాఱటందు రొకవెఱ్ఱి, నప్పుసప్పులు చేసి నీ టనుభవించి
యూఁగఁజాలక కాశిరామేశ్వరములు, లేచిపోయెడు దుర్బుద్ధి లేమచోట. ౧౪౬
గీ. నూటనలువదియేడునా నుతికిఁ బాత్ర, మయినవెఱ్ఱిని వినుఁడు తా నన్యజనుల
భూము లన్నియుఁ దనవనిపులిమిపుచ్చి, యప్పుగొని తెచ్చియెగఁబెట్టు నధముఁడున్న.
గీ. నూటనలువదియెన్మిద నూఱటివెఱ్ఱి, యొరులసొమ్ములు గొని తన కున్నదెల్ల
భార్యపేరను వ్రాయించి పాండిచేరిఁ, జేరి మూఁడేండ్లపిదప వచ్చిన యతనిది. ౧౪౮
గీ. నూటనలువదితొమ్మిదౌ కాటువెఱ్ఱి, యప్పుదీర్పక సన్న్యాసమంది యాలు
బిడ్డలను వెంటఁగొని భిక్షవేళ నిచ్చ, దక్షిణల వారిఁ బెంచెడుధన్యుఁ జెందు. ౧౪౯
గీ. నూటయేఁబదియవ వెఱ్ఱి నుడువఁదగదె, చిల్లరప్పులకై యాస్తి చెల్లిపోవ
నప్పుబాధలు పడలేక యపుడు కన్నుఁ, దెఱచి విషభక్షణంబునఁ దెగినయెడల. ౧౫౦
గీ. నూటయేఁబదియొక్కటౌను గన వెఱ్ఱి, యున్నయప్పుడు కనుగాన కూడినంత
నెక్కుడే నొక్కయుద్యోగ మిండటంచు, నెల్లవారలఁ గని యాశ్రయించునపుడు.
గీ. నూటయేఁబదిరెండగును ధరనొక్క, వెఱ్ఱి కలిగియుఁ దినక వ్రేల్వెట్టిరొట్టె
నేతిగిన్నెకుఁ జూపుచు నీరసిల్లు, లోభివారలసొమ్మొరులు గొనిపోవ. ౧౫౨
గీ. నూటయేఁబదిమూఁడగు నుడువరాదొ, వెఱ్ఱి నిల పత్రకములోన వేలకొలఁదిఁ
జేర్చి భార్యకు నగలుగాఁ దీర్చి సభల, రిక్తుఁడ నటంచుఁ బలుమఱు వ్యక్తపఱుప.
గీ. నూటయేఁబదినాలు గందు రొకవెఱ్ఱి, నెన్నిసారులో సభకెక్కి యొఱుకపఱిచె
రిక్తుఁడ నటంచు వాని కాసక్తి బిడ్డ, నీయఁగా నెన్న నందు గ్రహించుకొనుఁడు.
గీ. నూటయేఁబది వెనుక నేనుగ గణింత్రు, వెఱ్ఱి నొకరిని గాదని జుట్టుకొనఁగ
రాశి దిరుగఁగ నంగవస్త్రంబుఁ జుట్టి, యెత్తలే కీడిగిలఁబడు హీనుఁగాంచి. ౧౫౫
గీ. నూటయేఁబదియాఱంచును వచియింత్రు, గిటుకులను మర్మములు నెఱిఁగియు ధనంబు
కొలఁదికిని మీఱియుండియుఁ గుదురుపాటు, లేక వాణిజ్యమునఁ బెట్టి లేమివడిన.
గీ. నూటయేఁబదియేడగును మఱియొక్క, వెఱ్ఱి దలవెంద్రుకను ముడివెట్టి కొండ
నాఁచికొనఁ జూడఁ బెద్దపుండల కొసల్లు, వెట్టు నెంచిన సాగక వెతలుగుడుప. ౧౫౭
గీ. నూటయేఁబదియెన్మిదౌను వినుఁడొక్క, వెఱ్ఱి యత్యాశచేత నీవిశ్వమెల్ల
నొల్లుకొని బుగ్గనిడఁ జూచి డిల్లపోయి, చదికిలంబడి చెడునసజ్జనుని తెలివి. ౧౫౮
గీ. నూటయేఁబదితొమ్మి దన్న సఖ యిట్టి, వెఱ్ఱిని దనది కూఁతును బెఱలదైనఁ
గుంభమనియును దలఁచి వాగ్గుంభనమ్ము, నెఱపి బెఱపింపఁబోయి తా బెఱచె నేని.

గీ. నూటయుఉవదియవ వెట్టి నూలు ప్రోగు, నకును గట్టువడంజూచు నరునిఁ గొంచె
ముక్కులను గట్టబెట్టి నమార్జితాత్ము, నాస్యరంగంబునను లాస్యమాడుచుండు. ౧౭౦

గీ. నూటయుఉవది యొండుగాను నుతియింత్రు, పెండ్లి వెట్టిని దీనిలో భేదములును
వివిధరీతులు వివరింతు నవహితమతి, నాలకింపుఁడు రసికాగ్రయాయులార.

గీ. నూటయుఉవదిపైని రెండుగ మదింతు, రవని నొకవెట్టి నెవ్వఁడే నధికుతోడ
వియ్యమును రించుకొనఁగ నుర్విఁ దలక్రిందు, చేసి రొక్కంబు వెచ్చించుచేతఁ గనిన.

గీ. నూటయుఉవదిమూఁడుగాఁ దేటపఱుతు, వెట్టి ధనధాన్యముల విఱ్ఱవీఁగుక తన
నధికకులుతోడ సంబంధ మభిలషించు, హీనకులు నెత్తికోలు మహీతలమున. ౧౭౩

గీ. నూటయుఉవదినాలుగునుగ నెఱుంగుఁ, డొక్క వెట్టిని హీనుఁ డుద్యోగవశత
విశ్రుతుండయి తనబిడ్డ బీదవడిన, స్వకులునకు నీయ నలజడిపడున యేని. ౧౭౪

గీ. నూటయుఉవదియైదగును దిలకింప, వెట్టి పైదాని భేదంబు విత్తవృద్ధి
విద్యనేర్చినకూఁతు నీవెఱచి బీద, యక్కకొడుకున కుంచుఁ గన్యాత్వమునను. ౧౭౫

గీ. నూటయుఉవదియాఱగును దిలకింపుఁ, డొక్క వెట్టిని బీద కీనోపఁ డింతిఁ
గొడుకునకు ధనమిచ్చెదఁ గోరినంత, యధికకులులార బిడ్డనిం డనునరుండు. ౧౭౬

గీ. నూటయుఉవదియేడగును విదితముగ, వెట్టి స్వకులజుతోడను బెండ్లిసేయ
నెంచ విద్యాధికత నొప్ప కింతిగోరు, నన్యకులు వేషభాషల నరసి యొకట. ౧౭౭

గీ. నూటయుఉవదియెనిమి దందు రిటువంటి, వెట్టి బీదను దెచ్చి తా విద్యనేర్పి
బిడ్డ నీఁజూచుమగనికి నడ్డువచ్చి, యతివ తనకట్టియల్లుఁ డనర్హుఁడనిన. ౧౭౮

గీ. నూటయుఉవదతొమ్మి దౌను సుతకీవు, పెండ్లియేటికి విద్యనేర్పింత మనుచు
బాల్యమునఁ బెండ్లిచేసిన భంగమనుచు. నిల్పియుంతురు విధి నాఁపనేర్తు రెవరు.

గీ. నూటడెబ్బదియవ వెట్టి బోటి విధవ, కాకయుండునటంచుఁ జక్కంగ నెదుగు
వఱకు నిలుపుదు రేని నాపైని గాదొ, బ్రహ్మగీఁతను దప్పింపవలఁతు లెవరు. ౧౮౦

గీ. నూటడెబ్బదియొకఁ డనందొఁచి పట్టు, బాలికల నమ్మఁజూపిన వ్యర్థకులను
బిడ్డలను సొమ్మునకుఁ గొను బేరగాండ్ర, మాఱుబేరము చేయుసమర్థులనిల. ౧౮౧

గీ. నూటడెబ్బదిరెండవ పోటువెట్టి, వత్సరమునకు నూఱుకూపాయ లనుచు
నరువు లేదంచు భార్యకం దర్ధమిచ్చి, తాను సగపాలుగొనునట్టి మానవునిది. ౧౮౨

గీ. నూటడెబ్బదిమూఁడగును దనభార్య, గర్భవతియైన బాలికఁ గనుమటంచు
నాదుభాగ్యంపుముల్లె యీనీదుగర్భ, మనుచు గర్భము ముద్దాడు నతని వెట్టి. ౧౮౩

గీ. నూటడెబ్బదినాల్గగును బెఱవెట్టి, వరుఁడు చదివెదునన్నాళ్లు వలసినంత
ధనమునిం డిందు బేరమంచనఁగనేమి, యనుచు ప్రేలెత్తుబెల్లము నడుగుచోట. ౧౮౪

గీ. నూటడెబ్బదియైదు నెన్నుచురు వెట్టి, నర్థవంతులు శుల్కంబు నడుగ కాత్మ
జులకుఁ బెండిలిసేయఁగాఁ బాలుకఁపనము, తనకుఁ దాఁజేసికొనియెనం చనిహసింప.

గీ. నూటడెబ్బదియాఱగును విశదంబు, వెట్టి నాబిడ్డనిచ్చెదఁ గుఱ్ఱవాని
సీమకుంబంపి చదివింప సిద్ధపడుదె, యనుచు ననుముట్టుకొనకు మన్నతనియుక్తి. ౧౭౬

గీ. నూటడెబ్బదియేడగును గన వెట్టి, శుల్కమునుగొన్న నమ్మెడుచొప్పుగాఁగ
నొరులనగి; యర్థవంతుఁడ నొక్కకొడుక, టనుచుఁ గట్నంబులడుగుటయందులోన

గీ. నూటడెబ్బదియెన్మిది నూలుకొనును, దమ్ము లన్నలు లేకుండ ధనము గలిగి
చదువుచున్నట్టివరుఁడు తా నొదవెనేని, కూఁతురు సుఖించు ననువారికోర్కి వెట్టి.

గీ. నూటడెబ్బదితొమ్మిదై నూల్కొనునది, వెట్టి ధనవంతుఁ డడుగుచు విత్తహీనుఁ
డడుగ, నవ్వుట, తనకేల యర్థ మొరుల, కేలవలదొ విచారింపుఁ డోలిదీని. ౧౭౯

గీ. నూటయెనుబదియవ వెట్టి నుసలనీయ, దత్త లేకుండవలయును నాఁడుఁబడుచు
లుండఁగూడదు చదువొండె నొండెయర్థ, మున్నవరుఁ దెమ్మనెడు తల్లియూహయేచి.

గీ నూటయెనుబదియొక్కటై నొడువఁదగిన, వెట్టియని పెండ్లియైనంతఁ బెండ్లికొడుకుఁ
జదువుమిష నిల్లటము దెచ్చి జనకులందు, భేదభావంబుఁ బుట్టించుపెద్దలందు. ౧౮౧

గీ. నూటయెనుబది పిదప రెండుగ నెఱుంగుఁ, డాత్మజకు భూషణమ్ములు నమ్మకైదు
నాళ్లులాంఛనములు రెండునడలబండ్ల, యద్దె ఖండించుకొనువారి యగడువెట్టి. ౧౮౨

గీ. నూటయెనుబదిమూఁడగును మహినొక్క, వెట్టి మేళము పల్లకి సీణపాట
హరికథలు గాక పెండ్లివా రందఱకును, వెండిపువ్వులపీఁటలం దెం డటన్న. ౧౮౩

గీ. నూటయెనుబదినాల్గగును మఱియొండు, వెట్టి యల్లుఁడు ఫలహారవేళ రాఁడు
పంపెదరె బావగారు నా బాగుగాదు, నేను బంపుట రం డెవరేని యనిన. ౧౮౪

గీ. నూటయెనుబదియైదగును గనుఁ డొక్క, వెట్టి విడిదెకు రా రొకవేళనైనఁ
జాకలియు మంగలియు నిన్నఁ జూఁపనేన, వైచికొంటి నటం చాడువానియందు.

గీ. నూటయెనుబదియాఱగును దెలియుండు, వెట్టినొకదాని విడిదెలో వేఁడినీళ్లు
లేవు చాకలి బట్టలరేవు లేదు, కట్నములవేళఁ జూడుఁ డింక ననుసప్తు. ౧౮౬

గీ. నూటయెనుబదియేడగును బరికింప, వెట్టి వేఱొండు చాకలీ విసరవేర
మంగలీ కాళ్లుపిసుకు మం చంగలార్చు, తిండిపోతులమేళంబు తెండుచోట. ౧౮౭

గీ నూటయెనుబదియెన్మిదౌను వివరింప, వెట్టి భోగముచానపై వెట్టిచూపు
పఱపి పరుఁ డని యదియెంచి వందనంబు, చేయమిని గిన్కఁబోయెడు చెడుగునందు.

గీ. నూటయెనుబదితొమ్మిదై నుతికి నెక్కు, వెట్టి యల్లుఁడు మేళము విడిచి యిపుడె
వెళ్లె మడిగట్టుకొన వానిఁ బిలువ రంచు, వరునిజనకుండు కసరు నవసరమునను.

సీ. నూటతొంబదియయ్యెను వినుం డొకానొక వెట్టిని భుజియింపఁ బిలువవచ్చి
వంటలైనవి లెండు పౌరులందఱు వచ్చి రనిచెప్ప మీరేగుఁ డందఱు నిదె
కొనివత్తు నని పెండ్లికొడుకు తండ్రియన మీ కేల యాపని వారి నేల పిలువ
నీరు మర్యాదపోయెను రేపు కాకిచే వార్తపంపరె మెత్తవడఁగరాదు
పెండ్లిబిగువులు నడకలుఁ బ్రిదులరాదు, చెంబులును బట్టుపంచెలు జేతఁబట్టు
కొనియెపోదుము బ్రాహ్మణు ననుపలేదు, చూచితిరె యని జామాత శోకమందె.

మత్త. నూటతొంబదియొక్క టయ్యెను నూతనంబగు వెట్టియే
చోటలే దిటు లల్కపానుపు చోద్య ముంగర మీయరా
మాటలాడక లేచివచ్చెను మంచిపెండ్లికుమారుఁడే
సాటివచ్చెను మామ కల్లుఁడు చాలునంచని పల్కినన్. ౧౯౧

మత్త. నూటతొంబదిరెండు గాఁగ జనుల్వచింతురు వెట్టి నీ
పీటఁగాని మఱొక్కచో నిదివింత పానుపుమీఁది దే
పాటిదేనియు నాఁడుబిడ్డకు వచ్చుదుప్పటి చాకిదా
మూటఁగట్టెను పెండ్లిలాంఛనముల్ త్యజింతురె యంచనన్. ౧౯౨

మత్త. నూటతొంబదిమూఁడు గాఁగ మనుష్యు లెంచెదువెట్టి చెం
డ్లాట జూదము లాడరేకద యత్తపై మఱఁదండ్రపైఁ
బాటపాడరు పెండ్లికూఁతురు పాట లెంతవినోదమే
వాటమే భుజియించి మిన్నక పండుకొందురొ యందురేన్. ౧౯౩

మత్త. నూటతొంబదినాలుగౌను వినుండు వెట్టి నిదేమిటో
పాటపాడినఁ దిట్టు వెంకను భర్త స్త్రీలకుఁ బెండ్లిలో
నాటవిద్యవిలాసమౌను గురమ్మ పాటలపుస్తకం
భేటికే నరసమ్మ పాడవె యేమి సిగ్గని పల్కుచోన్. ౧౯౪

మత్త. నూటతొంబదియైదు గాఁగ మను న్వినోదపువెట్టి యి
ప్పాట నెప్పుడు నాఁడువారల ప్రక్కప్రక్కల నుందురే
పాటిగా మగవారు భోగమువాండ్రమేళము చూడరా
దోటు జంకక చెప్పవే మఱియొక్కపాటని పల్కుచోన్. ౧౯౫

మత్త. నూటతొంబది యాఱటంద్రు వినుండు వెట్టిని చెల్లరే
మాటలాడకుఁ డమ్మ చెప్పును మామ్మ చెప్పవె బావతో
పాటువచ్చితినం చదేమిటి బావపే రివరంచు స
య్యాటలాడుచుఁ దల్పుదగ్గఱ నమ్మలక్కలు నిల్చుటన్. ౧౯౬

మత్త. నూటతొంబదియేడుగాఁగఁ గొనుం జగం బొకవెట్టి దం
డాట గందవొడుల్ వసంతము లాడి కేరుచు నంతలో
నాటుకొన్న విచారముల్ నయనంబులం దడివెట్టుచుం
బాటపాడుచు నప్పగించెడు వారిమోముల దైన్యముల్. ౧౯౭
మత్త. నూటతొంబదియెన్మిదైనది నూత్నమా నొకవెట్టి యా
ర్భాటమై యిరువంక వేడ్కలు వైభవంబులు చెల్లియుం
బాటకుల్ రజకుండు మంగలి బానిసల్ వనయింటిలో
దీటుకోఁ బనిచేయుసంగతిఁ దెల్పినం జెవికెక్కదేల్. ౧౯౮
మత్త. నూటతొంబదితొమ్మిదైతగు నూత్నబంధుజనంబు లీ
పాటలాధరభర్త యెవ్వఁడు వానిమానిని యెవ్వరో
తేటయా నిపుడంచుఁ బ్రక్కలఁ దీర్చి చూచిన దంపతీ
పీటికాగ్రహణంబువేళను వెట్టి యిద్ధముగా మహిల్. ౧౯౯
సీ. ఇన్నూఱవదివెట్టి యిబ్బంగిఁ బెండిలి పరఁగిన వెన్క సంబంధు లాకటఁ
జేరి బావా యొద్దుఁజేరితి మీరైదు నాళ్లు నేఁ దలవంచినాఁడ నిపుడె
యెత్తితినన్ఁ జూడు మింతచేసితి దొంగవేలెముగిన్నెకు వెండిపూఁత
మనకును మన కరమరికలే డాఁడువారలవెట్టిఁ దీర్పఁ దరంబుగాదు
మీపురోహితునకు మేమిచ్చితిమి మాడ, దానికెట్టి మీరు తప్పకుండ
మాపురోహితునకు మఱవకయిందు నా, కబలినిష్ఠురంబు గాదటన్న. ౨౦౦

ఇది ద్వితీయశతకము.

---

## తృతీయశతకము.

సీ. ఇన్నూటయొక్కటి యొసఁగును వెట్టి మంచిపనిఁ జేసితి విప్డు చెల్లతేము
కట్నంబు లనుమాటఁ గట్టిపెట్టితివి కాలముగాదు బంధుజాలంబురాదు
చేత. లే దని యిది శ్రేష్ఠమైనదియు నిర్బాధకమైనది ప్రస్తుతనన్న
మిడితివి హాయిగా నేగెద రంద అంచనఁ గొన్నికట్నము లందునందు
రావలయు నింక నాయింట రాదుకార్య, మెట్లువచ్చును బ్రాఁతవా రీయవచ్చుఁ
గాదె రాత్రైరి నేఁ గష్టకాలమందు, వానలోఁ బోయి చదివించివచ్చితి నన. ౨౦౧
క. ఇన్నూటరెండుగాఁ జను, తెన్నందగువెట్టి కోడ లింటికిరాఁ గాఁ
జన్నవినోదము లెల్లను, సన్నుతగుణ లత్తలందు సాజములగుటల్. ౨౦౨

క. ఇన్నూటమూఁడుగాఁదగుఁ, గన్నియఁ గోడుకునకుఁ దెచ్చి కామునఁడై తాఁ
గొన్నటులు మామనాడుట, యెన్నఁడో చెప్పఁదగుమాట యిపుడనుచుంటిన్.

క. ఇన్నూటనాలుగవ వె, ట్టిన్నమ్మఁగవచ్చుఁ గొందఱికి ననుభవమం
దున్నకతంబునఁ జూపిన, కన్నియ మఱపించి యొండుకన్నియ నిడుటన్. ౨౦౪

క. ఇన్నూటైదవ వెట్టి చ, నున్నూతనవధువు సత్తనుతియించుట యుం
గొన్నాళ్లుచనిన మిషలం, బన్నుచు నిందించుటయును బ్రకటంబగుచున్. ౨౦౫

క. ఇన్నూటాఱవ వెట్టియు, సన్నుతమగుఁ గోడలు తొలిసారెను దేఁజూ
డన్నెలవుకొనినసంతస, మెన్నుచు నింటింటికత్త యేగి వచింపన్. ౨౦౬

క. ఇన్నూటేడవ వెట్టి యు, నన్నెగడును సారెలోఁదనకు మొల్లముగా
సన్ననిచీరలు నగ లు, న్న న్నవ్వుచు నత్తవధువునకుఁ జూపుదయన్. ౨౦౭

క. ఇన్నూటెనిమిదియవ వె, ట్టిన్నెలకొనియుండు స్నుషగుటిచ్చి నలువురతో
డన్నుడువు నత్తమాటల, నున్నగుణాగుణవిచార మూహింపంగన్. ౨౦౮

క. ఇన్నూటతొమ్మిదై తగుఁ, గన్నియ తనయాత్మజకు నగల్నాణెంబుల్
మిన్నగఁ దెచ్చినఁ బొగడుట, నున్నూన్యనతెఁ దెగడుటను గనుం డత్తకృతిన్. ౨౦౯

క. ఇన్నూటపదవవెట్టిని, జిన్నది గొనివచ్చినట్టి చిల్లరసరకుల్
చిన్నవన్ని చిల్లివని తన, కన్నెఱ చూపించు నత్తఁగనుఁగొనుఁ డార్యుల్. ౨౧౦

క. ఇన్నూటపదునొకండుగ, నెన్నందగువెట్టి కోడ లేమియుఁ బనిచే
యన్నేర దెట్లుపెంచెనొ, కన్నమ్మ యిదొక్కముద్దుగా యనునత్తన్. ౨౧౧

క. ఇన్నూటపదియు రెండగుఁ, జిన్నతనంబునను బనులుచెప్పక పనుపం
గన్నెకు నేర్పఁగ బడి నా, కున్నదొ యనునత్తగారి హుంకారములన్. ౨౧౨

క. ఇన్నూటపదునమూఁడగు, చున్నెఱయును వెట్టి తల్లి చూలాలైయుం
న్న న్నేను బెండ్లికానపు, డన్నియుఁ జేసితి నటనుచు నత్తపలికినన్. ౨౧౩

క. ఇన్నూటపదియునాలుగ, నన్నెగడును వెట్టి నాల్గునాళ్లకుఁ గొఱవ
ట్టైన్నాకోడలు దెచ్చిన, సన్ననిచీర యని యత్త సణుగుట యిలలోన్. ౨౧౪

క. ఇన్నూఱుం బదియేనగు, మొన్నఁటినాబిడ్డ సర్వము న్నేర్చెను నే
నెన్నఁడు నేర్పను పనిపైఁ, గన్నుంప దటంచు స్నుషను గసరెడు చోటన్. ౨౧౫

క. ఇన్నూటపదాఱగు నిది, యెన్నఁడు గదిలోననుండు నెన్నిపిలిచిన
న్విన్నట్టు లుండ దేమని, నన్నానోరె యని యత్త నసుకునయేనిన్. ౨౧౬

క. ఇన్నూటపదేడగు వె, ట్టి న్నేర్పరు లెప్పుడే నెఱిఁగికొందురు దాఁ
గన్నకొడుకుఁ గోడలు చెవి, చెన్నామాట విన డని వచించేమనోటన్. ౨౧౭

క. ఇన్నూటఁ బదియునెన్మిది, యన్నది తగు వెఱ్ఱి కోడలన్నను గుక్కం
గన్నుల్లో నీరసంబుగఁ, గొన్నను దనకూఁతునకును గూర్చునయేనిన్. ౨౧౮

క. ఇన్నూటం బందొమ్మిది, మన్ననకగు వెఱ్ఱి కొడుకు మాటాడఁగనీ
కన్నమువెట్టక కోడలి, బన్నములకు నత్త పాలుపఱచిన యేనిన్. ౨౧౯

క. ఇన్నూట యిరువదగు నొక, తిన్ననిపనికైనఁ దప్పుదిద్దుచు నేవో
కొన్నిట లోపము లెంచుచుఁ, గన్నెపయిం జూపు నత్తగర్వంబెల్లన్ ౨౨౦

క. ఇన్నూటిరువదియొకటగు, నన్నము దినవేల నీకు నైవండితి నే
నిన్నటిరాతిరి యని చలి, దిన్నిత్యముఁ గోడలికిని దిన నత్తయిడన్. ౨౨౧

క. ఇన్నూటిరువది రెండగు, నిన్నటి నీకంచ మోడు నేఁదొలిసారెం
గొన్నది చూడవె యిది నా, గిన్నెయనుచు నత్త కన్నె గేలియొనర్పన్. ౨౨౨

క. ఇన్నూటిరువదిమూఁడగు, నిన్నను గొన్నట్టికుండ నేఁడవిసెను నీ
కన్న సరిపనిత గలదే, యెన్నఁడుఁ గనమనెడు నత్త హేళన మవనిన్. ౨౨౩

క. ఇన్నూటిరువదినాలుగ, గు నన్నందనుతోడ నేర కూరను గారం
బున్నదె తప్పెన్నవు నే, నన్నను నల్లేఱుబండి వను నత్త యెడన్. ౨౨౪

క. ఇన్నూటిరువదియైదగుఁ, జిన్నప్పుడు చూడ రామచిలుక ట్లుండెం
గన్నమ్మ సారమో నా, కన్నులసార మ్మె స్నుషవికారము లనినన్. ౨౨౫

క. ఇన్నూటిరువదియాఱగుఁ, దిన్నది యేమగునో యేపుదేరదు పనులె
ల్లన్నెసె చేసికొందును, సన్నగిలుం గోడలని దిసంతులుగొట్టన్. ౨౨౬

క. ఇన్నూటిరువదియేడగు, మొన్నటియిరుగింటిసీతి ముప్పిరికడ్డి
యన్నిపను ల్తాఁజేయుం, జిన్నది తనయత్తయంటచెయి గదుగుననన్. ౨౨౭

క. ఇన్నూటిరువదియెనిమిది, కన్నదరెడునంతయోలిఁగైకొని యరిపే
దన్నిట్ట త్రాడు నంపెరి, తన్నులగొడ్డమ్యొ నదియు దైవము యనినన్. ౨౨౮

క. ఇన్నూటిరువదితొమ్మిది, కన్నను మది దనియకున్న కన్నియఁ గొడుకే
మున్ననఁ జూచునో లోకుల, కున్నొగులుటగాక యనుచు గోడొనరింపన్. ౨౨౯

క. ఇన్నూటముప్పదగు నిది, చిన్నద చితుకద యెవేళఁ జిఱుతిండికినూ
నె న్నేతిఁ బాడుచేయును, దిన్నను రివట యని యత్త తిట్టునయేనిన్. ౨౩౦

క. ఇన్నూటముప్పదియు నొక, టన్నది దినదినము దాని నంగడికనుచుం
దిన్నదిచాలక యని పెరి, మొన్నరు లెల్లవిన నత్త మిడికిన చోటన్. ౨౩౧

క. ఇన్నూటముప్పదియు రెం, డున్నయవిదులెఱుఁగుదురు గడుం దిండికి వాఁ
చున్నది తినని పిసర్లి, నన్నాథున కిడదు నంగనాచి యటన్నన్. ౨౩౨

క. ఇన్నూటముప్పదియుమూఁ, డు న్నేర్వఁగవచ్చు నెఱుఁగఁడు కుమారుం డెం
తున్నదొ యెంతైనదొ దీ, నిన్నమ్మను దెల్పు మట్టని విచారింపక౯. ౨౩౩

క. ఇన్నూటముప్పదియుమిఁ, దన్నాలుగుగాదె వెఱ్ఱి తమ్మునిబిడ్డం
గొన్నను గోడలుశబ్దము, విన్నపు డత్తలకుఁ బుట్టు వికృతిం దెలియ౯. ౨౩౪

క. ఇన్నూటముప్పదేనగు, మన్నిగడును బుత్త్రుఁ డింటఁ జూచుచునుండ౯
పొన్నమ్మ తినవె యన్నము, తిన్నంత నొకింత సేదదేఱు మటన్న౯. ౨౩౫

క. ఇన్నూటముప్పదాఱగుఁ, బున్నమనాఁ డింటనున్న పుత్త్రునితో నా
పిన్నది పలుకఁగ నొల్లక, మ న్నని పేఁడ యని చెప్పి మఱపించినచో౯. ౨౩౬

క. ఇన్నూటముప్పదేడగు, నెన్నివిధంబులను నత్త యిడుబాధలకో
ర్వన్నేరక కోడలు మగ, నిన్నూల్కొల్పినను దల్లి నేరములెన్న౯. ౨౩౭

క. ఇన్నూటముప్పదెనిమిద, గున్నొగిలినకతన మాటకును మాట యనౌ
న్నన్నగము చేయుఁ గోడలు, మన్నన లేదనుచు నత్త మఱిఁగిననేని౯. ౨౩౮

క. ఇన్నూటముప్పదియు మిఁ, దన్నవసంఖ్యయొకవెఱ్ఱి తల్లిని గొడుకే
మన్నను బెండ్లమువశమై, నన్నవమానించుఁ గొడుకునా వహియించు౯. ౨౩౯

క. ఇన్నూటనలువదయ్యెడు, నన్నమునకుఁ బిలువఁ గో[illegible] లాఁకలితేనం
చు న్నందనుపడుకింటఁ బ, రున్నదురుద్దేశ మత్తయుండు కెఱుఁగంగ౯. ౨౪౦

క. ఇన్నూటనలువదొక్కటి, విన్నను వగుఁ దొల్లితాను వివిధవిధముల౯
జన్నము లత్తవలనఁబడి, యున్నది యిట మఱువుచ్చు టూహింపంగ౯. ౨౪౧

క. ఇన్నూటనలువదియు రెం, డన్నది నీరాట రేవులం దత్తలపైఁ
గన్నెలు చెప్పుకొనినకత, లన్నియుఁ దమ రత్తలైనయప్పుడు మఱవ౯. ౨౪౨

క. ఇన్నూటనలువదియు మూఁ, డన్నుడిఁ వెఱ్ఱియగుఁ గోడలన్నను గోపం
బున్నను బియ్యము చేటను, చున్నను బుట్టింటి కేగ నొప్పనిమతికి౯. ౨౪౩

క. ఇన్నూటనలువదియునా, ల్గున్నతియించెదరు వెఱ్ఱిఁ గోడలుపగయుం
జిన్నిమనుమఁడు ప్రియుండై, పన్నగ మరి పడగ యాత్మబంధువు నైన౯. ౨౪౪

క. ఇన్నూటనలువదేనగు, మన్ననచెడుఁ దల్లి నెట్టిమాటన్నను నే
మన్నను భార్యకుఁ గోపం, బన్నితిని మతిని బాధ నలసెడునరులో౯. ౨౪౫

క. ఇన్నూటనలువదాఱగు, న న్నింటికిఁ బంపు మొండె నాచెప్పినరీ
తిన్నివు మెలఁగుమొండె య, నన్నడఁకుచు నాలిమాట నడచినయేని౯. ౨౪౬

క. ఇన్నూటనలువదేడగుఁ, గన్నెవినోదముగ నోమగఁడ దాఁచితి వే
ఱున్నమ తెస్సన ధనమును, నెన్నిక పేర్వడ్డ నరునియేమఱుపాటు౯. ౨౪౭

క. ఇన్నూటనలువదినిమిది, కన్నియలం దత్తలిపుడు కనఁబతిచెడునా
చిన్నెలు తమ్మత్తలుమును, పిన్నివిధంబులను బఱపు పేకరువిడుచే. ౧౪౮

క. ఇన్నూటనలువదియునిమిఁ, దన్నవసంఖ్యఁ జనువెట్టి తనయునితో నీ
చిన్నదిచెడ్డది విడువుము, ప్రన్ననివేఱొకతెఁ గొనుమురా యనుసేనిన్. ౧౪౯

క. ఇన్నూటేఁబది[illegible]గు నీ, వెన్నఁడు నొకదెబ్బవేయ విదిహేతువుగా
నన్నెదిరించును గోడల, టన్నను దలిమాంట గొడుకు లౌననివిన్నన్. ౧౫౦

క. ఇన్నూటేఁబదియొక్కటి, కన్నెలుచదువుటను వచ్చుకష్టం బిది యే
నెన్నఁడు నాకోడంట్రము, కన్నమ్మకు వ్రాయఁజూండు కమ్మల ననినన్. ౧౫౧

క. ఇన్నూటేఁబదిరెండగు, నెన్నఁడు మే మత్తమాట కెదురాడము మే
మెన్నియకార్యము లొనరిచి, నన్నోనాడ రని వృద్ధనారులు పలుకన్. ౧౫౨

క. ఇన్నూటేఁబదిమూఁడగు, నన్నము వెట్టునపు డంతె యవ్వల దినమం
దెన్నాఁడు మగలయెదుటం, దిన్నగ నిలువ మని యత్త దీర్ఘముదీయన్. ౧౫౩

క. ఇన్నూటేఁబదినాల్గగుఁ, బున్నెము పురుషార్థమో యెపుడు నాటకముల్
వన్నెలపాటలవృత్తము, లున్నారుల కనుమ త్తెలు పనులుచోటన్. ౧౫౪

క. ఇన్నూటేఁబదియైదగుఁ, గన్నకొమారితెలు చదువఁగాఁ బొగడుచు దా
నిన్నెమ్మి స్నుషపఠించినఁ, గిన్నరకంఠమని యత్త గేలి యొనర్పన్. ౧౫౫

క. ఇన్నూటేఁబదియాఱగుఁ, జిన్నప్పుడు నాకుఁ దల్లి చిలుకసమర్తన్
మున్నూఱు చెప్పెఁ బుస్తక, మెన్నఁడు ముట్టనని యత్త యెచ్చిలియార్వన్. ౧౫౬

క. ఇన్నూటేఁబదియేడగు, చున్నది యొకవెట్టి సుతకు నూరకపాటల్
మిన్నగఁ జెప్పుచుఁ గోడలి, కిన్నేర్పక పనులుచెప్పి కెడపినయేనిన్. ౧౫౭

శా. ఇన్నూటేఁబదియెన్మి దింట సుత నేకృత్యంబునం బిల్వ కిం
కెన్నాళ్లుందువె నేఁడో రేపో కొనిపోఁడే యింటెఁడు స్నీతల
మ్మన్నెపడ్డది యత్తచచ్చె సనునీమోహంబులేదమ్మ యీ
రెన్నాళ్లూరక యుండవే యనెడు మాతృప్రేమ వాటిల్లెడున్. ౧౫౮

శా. ఇన్నూటేఁబదితొమ్మిదై నెగడు వెట్టియున్న నోయంచు ముం
తన్నిండారఁగ నిప్పులు న్మిరెపగుండం బోసి తాను న్నుతుం
డున్నిర్బంధము చేసి కోడలికిఁ గట్టు న్మాతిఁ గోడంట్ర మీ
తెన్నన్ లోకమునందు ధాత విధియింతే జాలిలేకుండఁగన్. ౧౫౯

శా. ఇన్నూటర్వదియైనవెట్టి విషలిప్తేష్టాన్నముం బెట్టి చ
చ్చె న్నిన్నెల్లను శూలనొప్పి కనిపించె న్నిత్యముం గుట్లబొం

తిన్నాళ్లుండుట గొప్ప కోడలని యాదృత్యున్నతింబోలె నూ
ర్చ న్నాపుత్త్రినిఁ బోలెఁ బెంచితి దరిద్రుం డాత్మజుం డం చనుక్. ౨౭౦

శా. ఇన్నూటర్వదియొక్కవైవఅలు వేయింటం జగావెట్టి మే
మన్నాఁ డక్కఅకై కుమారిమెడలో హారంబు నీకిచ్చినం
గౌన్నాఁ డబ్బ మరల్పఁ డెప్పటికి మాకుం దెచ్చి యీకున్న నీ
కన్నం బిక్కడ సున్న పొమ్మనుచు నిత్యం బత్త వేధించినన్. ౨౭౧

శా. ఇన్నూటర్వదిరెం డగుం గఅవుచే నిల్లెల్ల గుల్లయ్యె నీ
కు న్నీనాథునకున్ సరాసరిగ నాకుల్వేఁకలే నంపరే
యిన్నాళ్లట్టులుగాదు నీకుఁ బడి హెచ్చేనెందుఁదెత్తు న్నరే
యున్నం దిందువు లేదటంచు స్నుషఁబస్తుంపించు నాయత్తచేన్. ౨౭౨

శా. ఇన్నూటర్వదిమూఁడగుం జడియ కేదీ యింట లేనప్పు మా
య న్నేమైనను బంపునట్లు గలదా యాధారమా వ్రాఁత యం
చన్న న్మాటకు మాట యోపలుఁవ నీ కట్లున్నదా చూడుమం
చు న్నానాగతిఁ దిట్టు నత్త మగువన్ సోల్లుంఠవాక్యంబులన్. ౨౭౩

శా. ఇన్నూటర్వదినాలుగుం దరుణమందేమానితిం; దల్లికిం
గన్నిం దే మన సయ్యకుం బడుచుపైఁగ న్నిట్టు లాయిద్దఱుం
గన్నెన్ గౌరిని బెండ్లిచేసి సుతు నిక్కట్లంబడం ద్రోతు రిం
కెన్నో భేదము లాలకింపుఁ డొగి నేనిందెల్ల వాక్రుచ్చెదన్. ౨౭౪

శా. ఇన్నూటర్వదియేనగు న్సుతకు మాతృప్రేరణంజన్న పెం
డ్లి న్నేనొల్లనటంచుఁ బుత్తెలను బల్మిం ద్రెంపి వేఱొక్కచో
పన్నాహంబునఁ బెండ్లిసేయు జనకు న్శంసింతురో యజ్ఞులై
కన్నెం గైకొనువారి మెచ్చెదరొ యుక్తం బెట్లొ యోజింపుఁడా. ౨౭౫

శా. ఇన్నూటర్వదియాఱులో జనకుచే నేర్పడ్డయల్లుండు దాఁ
జన్నం వైవవశంబు కన్య యిదియే శాస్త్రీయమా పెండ్లి సా
కున్నీవే వతి వంచుఁ దొల్లటివిధుం గోరున్ ద్వితీయంబు స్త్రీ
కున్నే యీకలిలో వివాహ మనుచున్ యుక్తు ల్విడంబింపఁగన్. ౨౭౬

శా. ఇన్నూటర్వదియేడగు న్సతిని దా నిష్టంబులే కేలఁడే
ని న్నాబి డ్డని కాంత, సంతుఁగొనిపో నేనీయ నీబిడ్డనం
చున్నాథుం డెదురాడి చేకొనును విజ్ఞుల్ తీర్పరు, ల్దీన ని
ర్గున్న న్వీరిటు రచ్చకెక్కుదురె మీ రూహించి నిందింపరే. ౨౭౭

శా. ఇన్నూటర్వదిరెన్మిదౌ నిటులు వా రీనంచుఁ బోనంచు నె
న్నెన్నో వాదములాడి రచ్చలను జేయింత్రంగనాయత్త మా
చిన్నత్రీరుపుచెప్పులోపునసె యీ సిగ్గోర్వలేనట్లు గాఁ
జన్నన్ శాస్త్రులు పూర్వనాదమును జర్చల్మానకున్నందునన్. ౨౬౮

శా. ఇన్నూటర్వదితొమ్మిదౌ సువిదతా నిచ్ఛింప కాత్మేశు నే
గు న్నానాగతులన్ వసించు నితరక్రోడంబుల న్నాథుఁడు
న్విన్నంబౌ టోకయింతలేక మసలు న్వేర్వేఱుమార్గంబులం
గొన్నాళ్లేగఁగ నజ్ఞత న్నిజసతిం గూడుం బ్రమాదంబునన్. ౨౬౯

క. ఇన్నూటడెబ్బదగుఁ బతి, యు న్నాతియు విడఁగ బిడ్డ శోకవార్థినం
బిన్నలుఁ బెద్దలుఁ దీరుతు, రన్నిసు వెవ్వరినిగోరు నవ్వారు గొనన్ ౨౭౦

క. ఇన్నూటడెబ్బదియునొం, టన్నందను నేనా నేను నందన నని యీ
కన్నియ పెండ్లివ్యయం బెటు, లన్నటు లని వాదగింతు రాలు న్మగఁడున్. ౨౭౧

క. ఇన్నూటడెబ్బదిపయి, న్మిన్నగ రెండగును వెఱ్ఱి మిథ్యావాదం
బున్నెఱపి యత్త జనకులఁ, జిన్నంబుచ్చుటను స్నున కృశించెడునచటన్. ౨౭౨

క. ఇన్నూటడెబ్బదియుమూఁ, డు న్నమ్మఁగవచ్చు బిడ్డఁడును బతిలేరే
నిన్నీట మునిఁగి చత్తున, టన్నంతటి దుఃఖ మాత్మ నత్త యుడినయేన్. ౨౭౩

క. ఇన్నూటడెబ్బదియునా, ల్గు న్నరు లెఱుఁగుదురు తల్లి కొడుకును వడి గొం
తున్నులిమి స్నుషను నూతను, సన్నకసన్నగను విడుచుసమయంబులలోన్. ౨౭౪

క. ఇన్నూటడెబ్బ దేనగు, నెన్నిక నధికారులెఱిఁగి యిది యేమనినం
గన్నియకు మూర్ఛయున్నది, నిన్నను జేఁదునపు డట్టె నెలకొనియె ననన్. ౨౭౫

క. ఇన్నూట డెబ్బదారగు, నన్నెఱి వధియించు టెఱిఁగి యందఱు ధనమం
దున్నట్టిదిపిఁ బక్షము, చన్నంతనె బిడ్డ నిచ్చుసందర్భమునన్. ౨౭౬

క. ఇన్నూటడెబ్బదేడగు, చన్నిగడును బతిని సుతునిఁ జూడక యిడుమల్
చన్నన్నేలని సతి నూ, తన్నీట న్మునిఁగి ప్రాణతతిఁ గోల్పోవన్. ౨౭౭

క. ఇన్నూటడెబ్బదెనిమిద, గు న్నూనెను ముంచినట్టి కోకను ధరియిం
చు న్నిప్పువెట్టుకొను స్నుషస, యెన్నివిధంబులను నత్త నీఁగుటకొఱకై. ౨౭౮

క. ఇన్నూటడెబ్బదియునం, తన్నవకంబగును వెఱ్ఱి తనకష్టంబుల్
తన్నత్తవెట్టుపాటులుఁ, జిన్నపురోణి నిడి నూతిచేరువ నిడిపోన్. ౨౭౯

క. ఇన్నూ టెనుబదియగు వినుఁ, డెన్నివిధంబులును గలవు పృథ్విని గన్యం
బన్నమ్ము లత్తవెట్టుట, కన్నెలు పెట్ట రని స్నుష స్వగణము నుతింపన్. ౨౮౦

క, ఇన్నూటెనుబదియొక్కటి, చన్నది మంచి దికపచ్చు చౌస విధము తా
నెన్నుట యెట్లని యత్తల, మిన్న విచారంబుగదుర మి న్నరసినచోన్. ౨౮౧

క. ఇన్నూటెనుబది రెండగుఁ, గన్నెల కత్తె లాకయప్పు కళవైనను మే
మున్నామని యాఁడుఁబడుచు, లన్నిద్రలు వెట్టుపాటు లాకశతకంబై. ౨౮౨

శా. ఇన్నూటెన్బదిమూఁడగు న్సతికిఁ బ్రాఘేయక్రియన్ వృద్ధయై
మూన్నాళ్ళట్టుడికించినట్టు స్నుష బా ముల్వెట్టి పోనత్త దాఁ
జిన్నప్డే విధవాత్వమంది సహజుం జేరు న్సదాకాలముం
బన్నంబు ల్వలప న్ననాంచ యువతీత్వప్రాభవం బొప్పఁగన్. ౨౮౩

క. ఇన్నూటెన్బదినాలుగ, గున్నానాగతుల వీరు గొలిపెడిబాధల్
దిన్నన్నము నీరగు నొడు, వ న్నేనని నడుముఁగట్టి వచ్చుతినేనిన్. ౨౮౪

క. ఇన్నూటెన్బదియైదగుఁ, గన్నియలం దెచ్చి యమ్మఁగా బేరముచే
యు న్నాకిమ్మని కొను నే, తెన్నున వచ్చినది యంచుఁ దెలిసికొనకయే. ౨౮౫

క. ఇన్నూటెన్బదియాఱగుఁ, గన్నియ ముచ్చిమిని దెచ్చి కైకొనుఁ డేఁబెం
ప న్నేరఁ దల్లిలేదయి, యున్న దటం చంటఁగట్టి యొకకొంత గొనన్. ౨౮౬

క. ఇన్నూటెనుబదియేడగుఁ, గొన్నంతఁ గ్రమక్రమముగ గుణములఁ గనిన
న్విన్నను మాటల మోసము, చెన్నగుఁ బితయేఁడి యేమిచేయుదు రవలన్. ౨౮౭

క. ఇన్నూటెనుబదియెనిమిది, కన్నపువొంగలు గ్రహించి కన్నియలను నె
ష్టన్నను దలిసంద్రుల కెఱుఁ, గన్నేరకయుండ నొసటఁ గాల్తురదయతన్. ౨౮౮

క. ఇన్నూటెనుబదితొమ్మిద, గు న్నందనులందు నాసగొని యత్నమునం
బ్రన్నని కుట్టం డెందే, నున్నను బల్మినిహరించు నుదుటులు గలుగన్. ౨౮౯

సీ. ఇన్నూటతొంబది యెసఁగుఁ బ్రయత్నించి కొన్నబిడ్డని చెవుల్గుట్టి నూది
పువ్వులు నడ్డకాల్వులు చిన్నెమచ్చలు నమరించి పెంచుచు నాత్మజనకు
లెఱిఁగి యేడ్చుచువచ్చి యిమ్మని బతిమాల నున్నాఁడు మీకింక నొకఁడు వీని
నిందు మా కిందున్న నేమిలోపము సర్వమును మీఁదె మాకాహామును గనుండు
వచ్చుచును బోవుచుండుఁడు వలసెనేని, గొనుఁడుమీకేమి నేఁగల్గఁ గుట్టి కెరవు
రైతి మయ్యాల మతనికి హాయిగాదె, యనుచు బుజ్జవమునఁ బంపునాతఁ డున్న. ౨౯౦

క. ఇన్నూటతొంబదొక్కటి, చిన్నకుమారులను దెచ్చి స్వీకృతిఁ బెనుపన్
మన్నిగొనుమారి వారిని, దిన్నఁగఁ గూర్చుండ కలఁతఁ దెచ్చికొనుటయా. ౨౯౧

క. ఇన్నూటతొంబదియురెం, డన్నలఁ దమ్ములను జేరు స్వార్జిత మని యొం
దున్నతనినో పరార్జితుఁ, గొన్నను స్వార్జితము పరుఁడకును బోవు ననన్. ౨౯౨

క. ఇన్నూటతొంబదియు మూఁడ, గను న్నిజశిశువులకుఁ జెల్లిపుటలో జనకుల్
గొన్నట్రిగుం బరగుయుటచే, విన్నను పురుగఁ జెప్పవచ్చు వెఱ్ఱి యటంచున్. ౨౯౩
క. ఇన్నూటతొంబది యునా, ల్గు న్నాపితపేరు నామగురుపే రని వా
దు న్నెరయఁ జేసి తునకే. తెన్నునఁ బో కబ్బి యనుచుఁ దేల్ప నరయుఁడా. ౨౯౪
సీ. ఇన్నూటతొంబది యైదవ నొక్కొగా నొకబిడ్డ యింక నేనొప్పుకొనను
దేవుని పే రనుతెలివ నింకొకసారి గానిమ్ము యిప్పుడు గాదునాదు
తలిదండ్రు లిద్దఱుఁ గలసిన పే ర్వెట్టుచు నటన్న తనపతితో వధూటి
యింకి వట్టిది తెంపు హీనమానుషులేల యనఁగ హీనులె నాదు జనకు లిస్సి
పొమ్ము నీదు తండ్రి పో హీనుఁ డగుఁ తల్లి, హీనురా లటంచు నీరసమునఁ
గొట్టుకొనుచుఁ దిట్టుకొనుచును దంపతుల్, పేరు పెండ్లిదాఁకఁ బెట్టరేని. ౨౯౫
సీ. ఇన్నూటతొంబదా ఱిప్పుడుఁ బుట్టిన బిడుతలు నిలువక పోయిరేని
నాసారిపుట్టిన యదియొసి బ్రదుకునఁ బ్రముఁ బెంటపైఁ బాఱవైచి తెచ్చి
పెంటయ్య యని పుల్లైవిస్తరిలోఁ బెట్టి పుల్లయ్య పుల్లాకు పుల్లి యనుచు
సీనిరపుంబనుల్ చేసి చింపిరి యాస వెఱ్ఱియ్య యని బల్మి విఱ్ఱఁజంపి
బాఁపనయ్య యటంచును బాముఁజంపి, పాముమంత్రంబునేర్చి సుబ్బయ్య యనుచు
రాజునయ లిబ్బులొంది స్వరాట్సమాఖ్య, నాత్మజన్మల నామధేయములు సేయ. ౨౯౬
క. ఇన్నూటతొంబదేడగు, మన్నామము వెట్టుఁ డేను మనిచెద నీబి
డ్డ న్నాధన మిచ్చెగ నిట, సన్నిలుపుఁ డటన్న వృద్ధనారుల మమతల్. ౨౯౭
క. ఇన్నూటతొంబదెనిమిది, చెన్నగుఁ దనమనుమరాలిఁ జెంతమెలపుకొం
చు న్నిపు తల్లిఁ జేరక, యున్నం బన్నసరవిత్తు నూ యని నేర్పన్. ౨౯౮
క. ఇన్నూటతొంబదితొమ్మిదైన, దు న్నాల్గగు నత్తపేరిడుహితకరము కా
ల న్నిపస్వాలలోఁ బాడిన, యస్త్రీని ముద్దరాలియాశయ మెన్నన్. ౨౯౯
గీ. మూఁడువందలులెక్కను మొనయు మతిను వెఱ్ఱి యందలి భేదము ల్వివిధముల వ
చింపఁ బోఁచినయట్లు మాషింధువారి, నోటవాసముచేయుచుండును సతంబు. ౩౦౦

ఇది తృతీయశతకము.

---

## చతుర్థశతకము.

గీ. మూఁడువందలుయొక్కటై మురియు వెఱ్ఱి, మతమనఁగ నాత్మసమ్మతమార్గమందు
నడచుటయకాక యొకరియాజ్ఞ మన కేల, యనుచు నున్మార్గుఁ డందుమాధ్యమున నిలుచు

గీ. మూఁడువందలరెండగు ములుచవెట్టి, ద్వైత మెక్కుడు తక్కు వద్వైత మనుచు
మాధ్వులును స్మార్తులనతి ప్రమాదముగను, నాదులాడెడుచోట నివాసముండు. 3౦౨
గీ. మూఁడువందలమూఁడగు మూర్ఖులేల, వాదుసేయంగ నెందు మాప్రప్పుగలియు
కున్నదే చూడుఁడని వైష్ణవోత్తములు వి, శిష్ట మద్వైతమును గొనిచెప్పు వెట్టి. 3౦3
గీ. మూఁడువందలనాల్గగు మున్నుఋషుల, నిర్ణితిం గొన్నఋగ్యజుర్నియమ మెదలి
శాంకరంబని రామానుజం బటంచు, మాధ్వమని గ్రుద్దులాడెడు మనుజులభ్రమ.
క. మున్నూటైదుగ వెట్టియ, గున్నెరసిన త్రిమతములను గొట్టుచు శైవం
బన్నది వైష్ణవ మన్నది, మున్నొకవీరపదయుతి సముద్భవమైనన్. 3౦౫
క. మున్నూటాఱగువెట్టియ, గన్నాగము పాశుపతము గాణాపత్య
బున్నెశాచరశాక్తే, యోన్నతమతము లవి లేచి యూఁగాడెడుచోన్. 3౦౬
గీ. మూఁడువందలయేడుగా మొనయువెట్టి, క్షాపణికమును గాపాలికంబుఛైత్క
దీక్షకంబనఁ దన్మతధ్యేయుదైవ, తములు శాస్త్రము లున్నట్టి స్థలములందు. 3౦౭
గీ. మూఁడువందలయెన్మిదౌ మునుపటివియుఁ, గా కమానుషికంబులు గాఁగబౌద్ధ
మనుచు మాహొమ్మదీయమంచును నడుమను, క్రైస్తవంబంచుఁ దన్మతకర్త లలర. 3౦౮
గీ. మూఁడువందలతొమ్మిదౌ ముఖ్యమతిము, ప్రబలిప్రాచుర్యమునకురాఁబ్రభులుప్రజల
నియతిచేయించుటకుఁ బ్రయత్నించుచునవస, రంబునం దోఁచు కష్టఘోరకృతులందు.
గీ. మూఁడువందలపది మురువయ్యెనీవల, వీరిఁజూచి కొంతవెట్టిపుట్టి
రాట్టులనుచు రాజరాజులంచును స్వాము, లనుచు వెలసియుండి రందునందు. 3౧౦
క. మున్నూటపదునొకండగు, నున్నతిగను వర్ణమునకు నుపవర్ణంబు
ల్పన్నంబై వాదడుచుచు, నన్నే చూడుమని వింతనాటక మాడన్. 3౧౧
సీ. మూఁడువందలమీఁద మూఁడునాల్గులవెట్టి ప్రభవించెఁ జిలవలుఁపలవ లేచి
బ్రాహ్మణాదులు స్వగౌరవము వెల్లడికాఁగ విప్రవినోదులఁ బెట్టికొనిరి
రాజులు బట్టులఁ బ్రబలంబుచేసిరి సాలిపెద్దిలు మాసటులు దాస
రులు పిచ్చుకుంట్లును రుంజలు పొడపిచ్చుకలు నిట్లు ప్రతివర్ణగౌరవంబు
గూర్చిముచ్చటింపఁ గోరి యాచకవృత్తి, వారికనురఁజేసి స్వధనపుష్టి
నెవరివారి వారు వృద్ధిసేయఁగ నవి, కొన్నిజాతు లగుచుఁ గూడె నిందు. 3౧౨
గీ. మూఁడువందలపదుమూఁడు ముచ్చటగును, మతము వెట్టిని రాజులు మానుకొనిరి
పాలనమ్మును బ్రాణము ల్గోలుపోయి, రెండటో యని యాలించినందుకతన. 3౧3
సీ. మూఁడువందలపదుమూఁడు పైనొక్కటౌ వెట్టిని జదువుఁడీ విబుధులార
యిన్నూటతొంబదా అన్నదానికిఁ గ్రిందఁ జేతులలోఁ జిత్రవిధము లిప్డు

పి. సుబ్బరావని కే. సూర్యరావని రెవెల్. రామచంద్రుఁడం చీ. యమ్. పంతు
లని టీ. కె. చార్యులం చని సీ. పి. రావని డబ్లియు వెంకన్న డాటరు ముస
లమ్మయంచు యం. వి. హాలంచు నీరీతిఁ, బేరులంచు వింత వెడలు చుండె
నిల్లుఁ బేరుఁ బోయి యింగ్లీషుపాడియాత్మ, రములు నిల్చె నేమొ క్రమముగాను.

క. మున్నూటపదేనయి నిలు, చున్నత్యముగాఁగను పరిశుద్ధుఁడు దేవుం
డున్నాఁడన లేఁడన లే, కున్నం గల్గినను నిష్ప్రయోజన మనినన్. ౩౧౫

క. మున్నూటపదాఱగు లేఁ, డన్నను దోషంబు గలఁడు ప్రారబ్ధంబుం
గన్నంత దేవుఁడున్నాఁ, డన్నది నిశ్చయము తెలియ ననవసర మనన్. ౩౧౬

క. మున్నూటపదేడగు మను, వున్నంతటి శక్తి యిప్పు డుండదు కష్టిం
చె న్నిలిపె మంచిదారిని, మన్నిక బ్రదుకుటయె మనకు మంచిది యనినన్. ౩౧౭

క. మున్నూటపదియునెన్మిది, యెన్నఁడు దేవునకు శక్తి హీనంబగునే
చిన్నతనం బటులనకుము, తిన్నని మార్గమ్ము నీకుఁ దెలియదనియనన్. ౩౧౮

క. మున్నూటపందొమ్మిది, యన్నది మనశక్తి యుడిగె నా దేవుని జూ
డన్నేరము మున్నిటివా, రన్నం గన్గొనఁగఁ జాలి రని వాదింపన్. ౩౧౯

శా. మున్నూటిర్వదియౌ స్వశక్తియుడుగం బో యెందు నానాఁటికిన్
మున్నెవ్వారును జూడనట్టి విషయంబు ల్గాంచుచున్నార మం
చున్నీల్గుం గలవానిఁ గానఁ డితఁడా నూతన్నాంశము ల్చూచుఁ జా
లు న్నవ్వంగలరంచుఁ జీవిసరుపల్కు ల్పల్కువానిం గనన్. ౩౨౦

క. మున్నూటిర్వదియొక్కటి, గు న్నా దేవుఁ డధికుండు గొఱ నీదేవుం
డన్నతనిబుద్ధిలేమికిఁ, జిన్నినగవుగాక ప్రతిగఁ జెప్పడు రేనిన్. ౩౨౧

క. మున్నూటిర్వదిరెండగు, సన్నింట సహాయ మేయు మనుమా వేదం
బన్నను నమ్మఁడు తనతను, పు న్నగలోనరించినారు పో యని నిక్కన్. ౩౨౨

సీ. మున్నూటయిర్వదిమూఁడగు వెట్టిలో వేదంబులును సత్యవేదములును
దానిలోఁ గ్రొత్తప్రాఁతలభేదములు నన్ని వేదంబులను దొల్లి వింతగాను
గ్రుడ్డికిఁ గనులొసంగుటకు గొడ్రాలికి బిడ్డనొసంగను బేదరాలి
కర్థంబులీయఁ బ్రత్యక్షమా దేవుఁ డీ యత్యర్థ నాగరకాగ్రగణ్య
కాలమున నొక్కరికి నెందుఁ గానరాని, కారణముఁ జెప్పఁజాలరు కాలశక్తి
యుడిగె నన నొప్పుకొనరు పూర్వోదితమ్ము, లనె గ్రహించుచు నీతుల ననువదింత్రు.

క. మున్నూటిర్వదినాల్గగు, చున్నది మావేద మెల్లఁ జూపించు ననుం
బెన్నంటుంగడు సట్లె, జ్ఞన్నను మిన్నరదము నింపు నతయుఁగరాదే. ౩౨౪

క. మున్నూటిరువదిరైయిదగు, మున్నిటిబోధకులు నిప్పుచుట్టిరి తినిరం
చున్నడువు నిపుడు బోధకుఁ, డెన్నఁడు తానేమిచేసె నిహిహీ యనఁగన్. 3.

క. మున్నూటిర్వదియాఱగు, చున్నది యావను లను మాట హూణు లనెడుమా
టున్నది మాగ్రంథంబుల, నున్నవె మీదాన నమ్ము నుడికింప ననన్. 3

శా. మున్నూటిర్వదియేడగు న్మనువు మీ భూగోళశాస్త్రంబులోఁ
గన్నారే మిము నేలుదేవుఁ డెపుడుం గాఁపుంచునాపుంచుకొం
డ న్నేమాయెవరెస్టు గాంచితిమి మింట న్సీరుశాస్త్రంబులోఁ
గన్నారా శనిగ్లోనిపట్నముల నాఁగా విన్ననాదంబులన్. ౩

శా. మున్నూటిర్వదియెన్మి దాబుధునిలో భూభృత్తులు ప్రాజ్యముల్
గన్నా మచ్చట మాదొరల్ దురకలున్ గంటెక్కియున్నారు మీ
చిన్నెల్లల్గినవారు చేరసుటచే సిద్ధంబు మేమెల్ల మీ
కన్నన్మందు జనించినార మని వాగ్వైచిత్రిఁ జూపించుటన్. ౩

శా. మున్నూటిర్వదితొమ్మిపర్యె శివు నమ్ముం డిమ్ముభాగ్యమ్ముల
న్నన్నన్మున్ స్వమతంబుగావునను విజ్ఞానంబు మెండైె నగున్
ఘన్నంబోయి సుఖింపనిండు పరమానందంబున న్భార్యతో
డన్నాబిడ్డలతోడ నంచని దవిష్ఠంబైన తావందినన్.

గీ. మూఁడువందలముప్పది మూర్ఖులనను, బూజయేమని తెగడి తామః నటు ప్రొటె
ప్రాస్టెస్టెంటులమాటల కట్టెమోస, పోయి కడగండ్లఁబడువారిపొంత నిలుచు.

క. మున్నూటముప్పదియు నొక, టిన్నవ్వుఁడు తావళము కటినిజుట్టును జే
తన్నిమురుఁ గంఠమునఁగల, నన్నున్నిందించు నతనినాట్యానుస్మృతిన్.

క. మున్నూటముప్పదియురెం, డు న్నెవినఁజాల దేవుఁడు గుడినిలుచునే
యన్నతఁడుఁ గట్టు నొకగుడి, నన్నని తానచట నఱచు నగరేల బుధుల్.

గీ. మూఁడువందలముప్పదిమూఁడు వఱలు, జీవహింసయొనర్చి యాజింప నవ్వి
నిత్యయజ్ఞముసేయు నన్నెరుపఱిని, మిన్నకుండిన బుధులసమీపమందు.

క. మున్నూటముప్పదియునా, ల్గు న్నెర వచింప మతములోఁ గలవెఱ్ఱి
స్వాన్నునిభక్తులు శివభ, క్తున్నేత్రము లెత్తిచూడ దోష మటన్నన్.

క. మున్నూటముప్పదేనగు, నన్నిటికిని ముందు తిరుపదాంకము లేదే
నిన్నిరసం బనుచుఁ దిరు, వన్నెలపులి తిరుకటుకని భాషించెదుచోన్.

క. మున్నూటముప్పదాఱగు, నన్నింటికిఁ జివర లింగమని చేర్పమనం
గన్నియు యాత్తయలింగము, యున్నములింగ మని పల్కొననవినుచోటన్.

క. మున్నూటముప్పదేడగు, నన్నిటు హత్తిపేరు లేనియది దోషం బం
చున్నా రాయగ నాతఁడ్, వెన్నుఁడె విభుఁడనని భక్తి వెట్టిని బలుకన్. ౩౩౭

క. మున్నూటముప్పదెన్మిది, యెన్నిక రామానుజా స్వమీంద్రా బసవా
తిన్నఁడె తిమ్మఁడె యనుచు, న్వెన్నుని దగకంటెఁ దలఁప విడచిరయేనిన్. ౩౩౮

గీ. మూఁడువందలముప్పది మూఁడునాలు, స్మార్తసానన మెడ్డు వైష్ణవుఁడు చూడ
రాదు వైష్ణవుతోఁ బల్కరాదు శైవుఁ, డనెడుబెట్టు భయముఁ జెఱచునపు డెన్న.

గీ. మూఁడువందలనలువది మురియు వెట్టి, వాడుక నమాను హేశ్వరపట్టనమ్ము
ననిరి లక్ష్మీనృసింహాపట్టన మటంచుఁ, జెప్పకొనుమాటలనుబట్టి గొప్పగాను. ౩౪౦

క. మున్నూటనలువదియునొక, టిన్నవతియనంతరమున డొక్కను మడమా
నన్నముఁ దినియుండెనక య, మున్న విడెంబుగొనఁ దానమొనయంగ గనినన్.

క. మున్నూటనలువదియురెం, టన్నరులను వెట్టిపట్టు నవ మన్నము పాల్
వన్నలు కదళీఫలములుఁ, దిన్నయనంతరము విడెము దినఁ గొంటలలోన్. ౩౪౨

గీ. మూఁడువందలనలువది మూఁడు మూతి, మీఁద మీసమున నియోగి మెఱయు శక్తి
లేనివైదికి గొఱిగించుఁ గానరాదె, తారతమ్య మటంచు సంతసముగొన్న. ౩౪౩

గీ. మూఁడువందలనలువది మొనసినాల్గి, టిని వహించిన వెట్టి యెట్టిదన వినుఁడు
తనపితామహుఁడో ప్రపితామహుండొ, మంత్రి యని బీద నేఁడు దంభములుగొట్ట

క. మున్నూటనలువదైదగు, నన్నీతఁడు చూచినపుడు నమయాను మును నేఁ
గొన్నాళ్లు చదువుచెప్పితిఁ, జిన్నప్పుడు పేద యిప్పుడు స్థితిమంతుఁ డనన్. ౩౪౫

క. మున్నూటనలువదాఱగు, నున్నతపదవులను గొన్నయుద్యోగులకొ
ల్లన్నేన గురుఁడ ననునొకఁ, డున్నయవిధిఁ జూడఁడుఁ బలుకఁడుం బుడుకఁ డనన్

క. మున్నూటనలువదేడునఁ, జెన్నప్పా! వీఁడు నాగుశిష్యుఁడు నాచేఁ
దిన్నాఁడు మొట్టికాయల, ను న్నగరాధీశు నెదుటనుం బడవెఱచున్. ౩౪౭

క. మున్నూటనలువదెనిమిది, మున్నీతఁడు నాజనకుప్రభుత్వమునం దె
ప్పు న్నన్నెత్తుకొనెడువాఁ, డిన్నాఁటికిఁ బెద్దయయ్యెనే యన నిలుచున్. ౩౪౮

గీ. మూఁడువందనలువది హాయితొమ్మి, దిని వచింతురు నన్నిడ్డు లేటిచూడఁ
డోసమాల్ నేన నేర్పితి నున్నతంపు, జదవి యాతనికబ్బె నం చదుటు నేని. ౩౪౯

గీ. మూఁడువందలయేఁబది వీఁడొ నేను, జదువుబడిలోనె చదివెను జట్టుబండ
యిప్పు డధికారియయ్యె నేదేని పదవి, నిమ్మనిన వ్రాఁతరాదని యొగురు ననిన. ౩౫౦

క. మున్నూటేఁబదియొక్కటి, విన్నఁదనం బింతలేక వీఁడొక ప్రభువా
చిన్నది యెవరదు మును మా, పిన్నాయన పిడుగటంచుఁ బ్రేలినయెడలన్. ౩౫౧

శా. మున్నా డేఁబదిరెండగుం గొలువులో ముజ్జిడ్డుగా వైదికుల్
గొన్నా రన్నిపదంబు లప్పుడు నియోగుల్ నేఁడు చేకొన్నవా
రున్నారేకద మంత్రిశేఖరు లటం చుద్వేజితు ల్పల్కఁగా
విన్నంత న్నగిరీసుూరకుండ కదియే విస్రంభ మాత్మంగొనన్.

గీ. మూఁడువందలయేఁబదిమూఁడు గొరలు, వెఱ్ఱి వైదికునట్టు లోవెసఁగ ప్రశ్వా
ముందుగలిపెదవా యని ఫుత్త్రుఁడిట్టు, నమ్మలక్కల యాత్మమర్యాద నరయు.

శా. మున్నా డేఁబదినాల్గునా జగములో మూర్ఖుల్ విశేషించి వే
షౌన్నత్యంబున మీఱుటం గులముమర్యాదల్ విసర్జించి రా
జున్నట్లార్యుఁడు నార్యుపోలికిని నైశ్యం డంత్యజుం డర్యున
ట్లు న్నానాగతులం జరించుటది చెల్లుం బండితాసహ్యమై.

శా. మున్నా డేఁబదియైదగున్ స్థితికినిమ్మందేని వేషంబుఁగై
కొన్నన్ గుడ్డల కేమిలోప మవినాకుంజిక్కవో యత్నరం
బు న్నేరం డతిగర్వియై తిరుగుచో మోసంబు వాటిల్లు నే
నన్నన్నచ్చెదు చెప్పువారెవరొ యంచల్లాడు నావెఱ్ఱికిన్.

శా. మున్నా డేఁబదియాఱుగా మనుజుమోముంజూడఁగా నే యితం
డిన్నాఁట న్వసియించువాఁడు కుల మి ద్దీవృత్తిలోవాఁడు నాఁ
డెన్నారంగను వేష ముండదయినన్ శ్రేష్ఠత్వముం బాసి పో
వు న్నవ్వం దలవంపులంద నది యొప్పు న్వెఱ్ఱియై మొఱ్ఱయై.

శా. మున్నా డేఁబదియేడగుం బలువు రల్పుల్ గొప్పవేషంబుతో
డ న్నిల్వంగఁ బ్రమాదబుద్ధి నిటురం డా యంచుఁ బీఠంబుచూ
ప న్నేనర్హుఁడఁగా నటం చవుడు దాఁపన్లేక సిగ్గొంది ప
ల్కు న్నాఁ డం దవమానమౌఁగద వివేకుల్గాని శ్లాఘింతురే.

శా. మున్నా డేఁబదియెన్మిదౌ నధికుఁ డున్మత్తాత్మవేషుండుగా
మన్నం గాంచు నగౌరవం బొకట నెయ్యుర్బాంధవుల్ మెచ్చ ర
చ్ఛన్నంబైన స్వకాంతి డిల్ల ననుచున్ సాధారణాకారతం
గొన్నం గొందరుగా కగర్వు లది లోకువ్వెఱ్ఱిగా నెన్నరే.

శా. మున్నా డేఁబదితొమ్మిదౌ నధికుఁడేమో దానుగొన్నట్టి యా
యౌన్నత్యస్థితి కల్పు నెత్తఁ గడ డాయంజూడఁ డానల్పతం
గన్నం గాంచునుగాని యల్పు నధికుంగావింపఁగా నేర్చు నే
యొన్నం డెవ్వ రొసంగి రీయధికృతిన్ హీ యంచు వెఱ్ఱిడ్చినన్.

శా. మున్నూటర్వదియైన తలిర్చు వృషభంబుం బోనివేషంబుతో
డన్నక్కాఱుపు లిస్సి నోరు మిదపండబ్బెత్తు శక్తుండు గాఁ
డన్నా యేటికి వీని కీ పొగరు వే యన్నేకయా వేష మి
ట్లున్నా మీయెడ మేనునొప్పి యని తానూర్పుచ్చు నావెఱ్ఱియున్. ౩౭౦

శా. మున్నూటర్వదియొక్కటౌ పలుకునే ర్మల్మీఱు వేషంబులం
జిన్న ల్పెద్దలుఁ బోవుపోకడలనేఁ జిత్రంబులన్ వ్రాసి క్రిం
ద న్నిర్మాణచమత్క్రియ ద్దెలిపి పాత్రం బొందు చేయం దలం
పున్న న్మానితి నిందుఁ జెల్ప నని యేమో వెఱ్ఱి వాక్రుచ్చినన్. ౩౭౧

క. మున్నూటర్వదిరెండవుఁ, దన్నుం బలపఱుచుకొనఁగఁ దక్కొన ప్రాణిం
దిన్నం దిననూహించిన, నన్నరునజ్ఞాన మధికహాస్యాస్పద మై. ౩౭౨

గీ. మూఁడువందలయఱువదిమూఁడు తప్పు, గాదు జీవికి జీవిగాక మఱియొండు
గలదె బ్రాహ్మణులు దినుశాకములు ప్రాణు, లనఁదగదొ యంచు వాదించు నతనివెఱ్ఱి.

క. మున్నూటఱువదినాలుగ, సు న్నాకాహారమునకొ కోపుట్టెను భూ
మిన్నిఖిలజంతువులు నే, సున్నది యేటికని యొక్కఁ డూహింపఁడయేన్. ౩౭౪

క. మున్నూటఱువదియైదగు, చున్నది మమ్మనిన బ్రాహ్మణోత్తము లొకయేఁ
ట న్నమలరె గజమస్తక, సన్నిభ మగుమాంస మనుచు సరిపుచ్చుకొనన్. ౩౭౫

క. మున్నూటఱువదియాఱగు, నెన్నఁటి భగవంతుఁ డఖిలమృగముల సృజియిం
చె న్నరుఁ డన్నిటి దానెటుఁ, గన్నరక చంపి తిని యఘం బొడఁగూర్పన్. ౩౭౬

క. మున్నూటర్వదియేడిటఁ, బన్నగమంత్రమ్ము నేర్చి పాముపగిదినుం
ట న్నరుఁడుపాట్లకాయఁ ది, నన్నడకిన నవ్వు వెఱ్ఱి నానాగతులన్. ౩౭౭

క. మున్నూటఱువదియెనిమిది, యెన్నఁడు హింసయని మదిని నెంచనివాఁడుం
బున్నమ నమవసఁ బెండిలిఁ, దిన్నది తప్పెఱచి యని విధిం గొనియాడన్. ౩౭౮

క. మున్నూటఱువదితొమ్మిది, ధన్నలు నెద్దులును జావఁ దోలాలిచికొనం
దిన్నం బాపముగా దగు, నన్నది విడనాడి చంపి యటుచేయ నగున్. ౩౭౯

క. మున్నూటడెబ్బదియగుం, జిన్నప్పటినుండి పెంచి చివికినపసి పేఁ
ప న్నరక కటికకు విలు, చున్నరుఁ డని యొకట వెఱ్ఱి శోకించునయేన్. ౩౮౦

క. మున్నూటడెబ్బదొక్కటి, యెన్నఁడు చచ్చునిది కాఁవు లిచ్చుట యెన్నం
డిన్నాఁడె కొంద మని విప, మున్నఅలకుఁ బెట్టు దుష్టపురుషులకేడ్చున్. ౩౮౧

క. మున్నూటడెబ్బదియురెం, డు న్నెర్పున నెటేఁగి యట్టిడొంగల గృహము ల
మ్మన్నెర్పిరి పడుగొడ్డుల, నన్నా యని వెఱ్ఱినవ్వు నాసమయమునన్. ౩౮౨

గీ. మూఁడువందలదెబ్బనిమూఁడు నఱక, నెత్తు రంతయుఁ బోవునం చొత్తి మొత్తి
యుడుములను గోతిలోనింపి యూరఁబందు, లను వధించెను నమయములను బూసం

క. మున్నూటదెబ్బదియును నా, ల్గున్నెర్రుర విజ్ఞలెఱుఁగఁ గుక్కలు క్షుధచే
నన్నపుఁటిలుసొచ్చినఁ దోఁ, కన్నఱకిన హింస యననికష్టుని దూఱన్. ౩౭

క. మున్నూటదెబ్బదేనగుఁ, జిన్నంతటినుండి జోడుచెడిచి శుకంబున్
సన్నిగూడునఁ బెంచిన, యన్నరులవినోదమునకు వ్యాఖ్యానముగన్. ౩౭

క. మున్నూటదెబ్బదాఱగు, నన్నము ముక్తి నని కాకియఱుతం గుదెగ
ట్టిన్నాటఁగట్టి నది పడు, ఖిన్నత గలకాల మతనిఁ గిల్బిషుఁ జేయన్. ౩౭

క. మున్నూటదెబ్బదేడగుఁ, గన్నపుఁగుక్కలను బట్టి కాఁగెడుగంజిన్
వెన్నునఁబోసిన దుష్కృతి, కెన్నాళ్లకు ముక్తియంచు నెంచెడువెట్టిన్. ౩౭

క. మున్నూటదెబ్బదెనిమిది, యున్నది సర్వజనసమ్మతోద్యత్కృతి హిం
సన్నం దోషము గట్టఁగ, నెన్నెమ్మల కిచ్చుబలు లనేకార్భటిగన్. ౩౭

క. మున్నూటయెనుబదికి నొక, టిన్నూనము న్యూనముగ ఘటించెడు నదియా
సెన్నికల జంతువులఁగొనఁ, బన్నినయురులాది బోనుపర్యంతంబున్. ౩౭

క. మున్నూటయెనుబదియగున్, దున్నల కెస్తులకు ముక్కుదుస్సిన నవి తా
మున్నన్నినాళ్లు దుఃఖము, నన్నరులను గిట్టుననుచు నలఁగెడు వెట్టిన్. ౩౮

శా. మున్నూటెన్బదియొక్కటౌ విసముపై ము న్నీఁగ కాల్మోపి యా
సన్నాన్నాదుల వ్రాల దోషమనునాచార్యుల్ సదా యంగడుల్
పన్నం గుడ్డరుగార్తు లర్భకుల నార్పం గాంచుచుం బల్కకే
యున్నం దీనికి నర్థ మే మనుచు నా యున్మాద మాశించినన్. ౩౮

క. మున్నూటెనుబదిరెండగుఁ, బన్నుగ సారస్వతమునఁ బండితులు కవుల్
మున్నిటివారలు మొదలుగ, నెన్నికఁగనఁ జేసినట్టివెల్లను వెట్టుల్. ౩౮

శా. మున్నూటెన్బదిమూఁడగు న్బుధుఁడు సంపూర్ణాఖిలామ్నాయముల్
~~వ్యాస్త్రీజిహ్వ~~నందు నిల్పి పలునావృత్తు ల్వచోవైఖరిం
బన్నంబు ల్తడఁబాటులేక నుడువున్ వ్రాల్సేయుచోఁ బట్టి వె
క్కన్నన్నం గనలేడె తొల్లియనఁడే కౌటిల్యుఁడం చాడినన్. ౩౮

క. మున్నూటెన్బదినాలుగ, గున్నందికులోద్భవుండు గొనకొని యలతి
మ్మన్న తనచక్రబంధము, నన్నిలుపఁడె తిమ్మనయన నడకెడువెట్టిన్. ౩౮

క. మున్నూటెనుబదియైదగు, సన్నుతకావ్యముల యుజ్వ స్వప్నములోనం
గన్నవి నుడివిన నందఱు, నున్నను లేకున్నఁ గలల నూటాడింపన్. ౩౮

క. మున్నూటెనుబదియాఱగు, నెన్నఁడొ పెద్దన్న వేఁటవృత్త మశేషం
బున్నొడువఁ గర్త యెదుటికి, నిన్నాఁడును సైంధవంబు నెఱుకులఁ దేఱన్. ౩౮౬

క. మున్నూటెనుబదియేడగు, నెన్నాఁడును గావ్యములను నింతులు చదువ
న్వెన్నంజవేయ నవయువ, సన్నుతి యొనరింప వెఱ్ఱి సహియింపదయేన్. ౩౮౭

క. మున్నూటెనుబదియెనిమిద, గు న్నారులు చదువుకొనఁగఁ గూడినకృతి యొం
దున్నదని యన్నియును బుసు, పోన్నతినే చెప్పననుచు నొగి వెఱ్ఱి యనన్. ౩౮౮

క. మున్నూటెనుబదితొమ్మిది, యన్నియుఁ బురుషాంకితంబు లైనను స్త్రీలున్
మన్ననఁ "గ్రూరుఁడనయ్యా", నన్నేలు మటంచుఁ గీర్తనము సేయ నగున్. ౩౮౯

గీ. మూఁడువందలతొంబదిం బురుషుఁ డతివ, వర్ణనము సేయ నతివ దా వ్రాయుకవిత
నతివ వర్ణించునే వింతయనుసరణపు, వెఱ్ఱిరా యని యొకవెఱ్ఱి విహసియింప. ౩౯౦

క. మున్నూటతొంబదియునొక, టన్నిలుచును వెఱ్ఱి కవి తనంబడ నదియే
మిన్నయని తప్పుత్రోవలఁ, బన్నెలవగునట్టి వేర్చి కూర్చినయెడలన్. ౩౯౧

క. మున్నూటతొంబదియురెం, ట న్నొగులును వెఱ్ఱి యర్పణముదాఁక పటూ
క్తిన్నెఱపి పిదపఁ బేలవ, ము న్నీరసరచనఁ గథను మొదలిడి చెఱపన్. ౩౯౨

గీ. మూఁడువందలతొంబదిమూఁడు మూఁడు, నెందు పద్యాంతములఁ బేర విడిచియుఁ బదునె
నిమిదివర్ణములందున నిమిడినవియొ, యనుచుఁ బరిహాసమున వెఱ్ఱి యాడెనేని. ౩౯౩

క. మున్నూటతొంబదియునా, ల్గు న్నొక్కి వచింపవచ్చుఁ గుఱ్ఱఁడును గవి
తోన్నతికి నడుముగట్టి ధ, రన్నేలను భువి వసుంధరను నవని ననన్. ౩౯౪

క. మున్నూటతొంబదేను గ, విన్నేనని కుకవి విఱ్ఱవీఁగుచు భాషా
భ్యున్నతికిఁ గృషియొనర్పక, యున్నది చెడఁగొట్టుకొను నోహో యనువెఱ్ఱిన్.

క. మున్నూటతొంబదాఱగు, నన్నిలోకంబు బుధగణానకుం దెచ్చెన్
వన్నెం బెక్కులి నని యొరు, ల న్నిరసించెడు మహాత్మ్యలాఘవముఁ గనన్. ౩౯౬

క. మున్నూటతొంబదేడగు, నన్నంబులు గొఱవించి నాయొద్దికి రా
కున్నను వారికి బిచ్చము, సున్న యటంచుబ్బు భావశూన్యుని వెఱ్ఱిన్. ౩౯౭

క. మున్నూటతొంబదెనిమిదిఁ, గొన్నాఁడను బట్టు మింకఁ గొదవే యనుచు
న్నన్నును మిన్నును వెదకి క, ను న్నీచపుసేవఁ జదువును విడుచు నహహా. ౩౯౮

గీ. ఒకటితక్కువ నన్నూఱు నొరయు వెఱ్ఱి, నల్పమేధావి పరిశోధకాగ్రగణ్యుఁ
డై రచించెడు రచనలయందుఁ గలుగు, లోపములఁ బండితులు చూడనోపనపుడు.

శా. నన్నూఱౌను బురాతనాంధ్రకృతుల న్నిర్దేశ వర్ణించుటం
గన్న న్వారి కజీర్ణరోగముల నక్కాలంబునం బాధయుం

డు న్నాఁ డెవ్వఁడు నావకాయఁ గొనిరాఁడుం దీన నానాఁడు తే
కున్నా నిల్వపదార్థము ల్దినుట తప్పో యంచు శోధించినన్. ౪౦౦

ఇది చతుర్థశతకము.

---

## పంచమశతకము.

శా. నన్నాటొక్కటియా మహాత్ము మదీనాలోను విశ్వస్తుఁ జే
కొన్నాఁ డాదినమాది నేఁటికిని సాగుం గొంచెకొంచెంబుగాఁ
జన్నాఁ డాకవి కాలిదాసు మును విశ్వస్తాభవేత్యాదిగా
నున్న ట్లింపక చెప్పె నంచు సభలోనూహా ల్వెలార్పంగడున్. ౪౦౧

గీ. నాల్గువందలరెండు చెన్నంగవచ్చు, వెఱ్ఱిగాఁ దాను సుకవియై పెఱకవులను
కుకవులనన్నఁ గృతికి లోకువ యటంచు, వెనుక ముం దేమి గన కన్నవేళ యందు.

గీ. నాల్గువందలమూఁడు వింతయగువెఱ్ఱి, పండితుఁడు తనజ్ఞానంబు వ్యర్థముగను
"బూజుపూర్వం"బనుచుఁ "ద్రోసిరా" యటంచుఁ, బ్రొద్దుపుచ్చుటఁగనినవ్వఁబోవు నెడ

గీ. నాల్గువందలనాల్గు ప్రజ్ఞాని ననుచు, విజ్ఞుఁడను దానేమి విశ్వమునకు
నుపకరించెను దాను నేను నొకరూపు, గాదె యని యొక్కపండితుఁ గని హసించ

గీ. నాల్గువందలయైదగు నాల్గుముక్క, లడ్డదిడ్డంబుగా నేర్చి యాలుబిడ్డ
లను విసర్జించి సన్న్యాస మనుసరించి, బంధువులపంచ తిన్నెలు పట్టితిరుగ. ౪౦౫

క. నాలుగువందలయాఱగు, సేలును గాషాయములును జెప్పులు ముక్కా
డ్డాలును ద్రాలఁగ యతినని, వాలాయము ధనికుబండ్లపయి నడయాడన్. ౪౦౬

క. నాలుగువందలయేడగుఁ, గాలముఁ గర్మంబు నంత్య కాలముఁ దెలుపం
జాలుదు నని ధరఁ జేరును, జాలిమఁ డాత్మగతి యెఱుఁగఁజాలఁ డని నగన్. ౪౦౭

క. [illegible]దలయెనిమిది, కాలుం జెయి విదిర్చి మేఘగంభీరముగాఁ
జాలఁగఁ జెప్పును నీతుల, నాలాగునఁ దాను జేయఁ డనువెఱ్ఱియగున్. ౪౦౮

క. నాలుగువందలతొమ్మిది, పోలన్ దుర్గర్వమునను భూప్రజలను బ
ద్ధ్యాలిని దూషించెడుకవి, నాలము గావించువెఱ్ఱి యజ్ఞుఁ డటంచున్. ౪౦౯

క. నాలుగువందలపది యగుఁ, జాలం డొకపనికిఁ జేయఁ జాలెడువారిం
జేలిక నిందించును గలి, కాలమురా యనుచు మూఢుఁగని విహసింపన్. ౪౧౦

క. నాలుగువందలపదునొకఁ, డాలరి కల్పించుగాథ లన్నియు నమ్మున్
బాలిశుఁడు దైవమా విన, డేలా నామాట లని వహించును వికృతిన్. ౪౧౧

గీ. నాల్గువందలపండ్రెండు నాఁడు కాళి, దాసునకు భోజునకు వారతరుణి యొకతె
యుండెనని దానిఁ గూర్చి వ్రాయుదురు గ్రంథ, ములనహో యని దుఃఖించి ముడుఁగు వెట్టి.

గీ. నాల్గువందలపదుమూఁడు నన్నపార్యుఁ, డిల్లు గాల్పించె భీము వ్యాకృతి నడంచెఁ
దనను గౌరవహానియం చని వచింత్రు. పాత్రముల వ్రాయుదు రటంచుఁ బొగులుచేసి

గీ. నాల్గువందలపదునాల్గు నగుసు బెద్ది, భట్టు వ్యాఖ్యానమొనరించి ప్రతిభ తండ్రి
కిచ్చెనని చూచినట్లె యిసీ జగంబు, మూర్ఖవాక్యంబులకు మోసమును భజింప. ౪౧౪

గీ. నాల్గువందలపదునైదు న్యాయమాడుఁ, గవుల మాటలు మోసినఁ గవు లగుదురు
బహుకవీంద్రుల భరియించువారు కవు ల, గుటకు నాలోచనం బేలొకో యటంచు.

గీ. నాల్గువందలపదునాఱు నాకవిత్వ, మిందుఁ దప్పులు వట్టుఁడం చిచ్చి చెత్త
పొత్త మందిది తప్పన్న బుస్సుమనుచుఁ, బడుచుఁదనమును జూపునవ్వాని దగును.

గీ. నాల్గువందలపదునేడు నలుగురైదు, గురు యథామతి బాగని జరపి పుచ్చ
వారు మెచ్చిరి యోగ్యతాపత్ర మిచ్చి, రనుచుఁ బొంగెదు దుష్కవి నావహింతు.

శా. నన్నూఱుం బదునెన్మిదౌ గవులలో నంగల్గు సన్మార్గముల్
కున్నం బెంచఁగలేక మిన్నకయ తాఁ గూర్చుండఁ డన్నింటికిం
దన్నే చూడు మటంచుఁ దప్పుకవితల్ తండోపతండంబు లా
త్పన్నంబొందఁగఁ జేయుఁ బెద్దలకుఁ జూపం డాత్మగర్వంబునన్. ౪౧౭

క. నన్నూఱుం బది యుఁదొమ్మిది, పిన్నలు కవులనుచి లేచి పెద్దలపోలెం
దిన్నగ నెఱుఁగక నేరక, చిన్నతన మ్మెఱుఁగలేక చిందులు ద్రొక్కున్. ౪౧౮

గీ. నాల్గువందలయిరువది నయవిహీనుఁ, డుచితమెఱుఁగక లక్ష్మీశుఁ డుర్విజామ
నోహరుండని నందసూనుండు రాఘ, వుండనుచు వ్రాయుఁ గృతుల దుర్బుద్ధికతన.

క. నన్నూటిరువదియొక్కటిఁ, దన్నెఱుఁగని గర్వగరిమ దర్పకబాధల్
వెన్నునకు లక్ష్మికిని గల్గఁ, గన్నిర్మింతురు ప్రబంధగతులం గుకవుల్. ౪౨౧

క. నన్నూటిరువదిరెండవను, మున్నిత మెఱుఁగని కుకవి వహోవైరస్యం
బౌన్నత్యమంద నసమయ, సన్నిహితము సేయుఁ గవితఁ జప్పని గాథల్. ౪౨౨

సీ. నన్నూటయిరువదినాల్గింటి కొక్కటి తక్కువయగా వెట్టి తనరుచుండుఁ
గోకిలపైఁ జూచి కుముదమిత్రునిఁ దిట్టి గాలికి సెగఁబడి కంతుఁ గందఁ
బలికి చిలుకపయిఁ బందులు గోటికె యుపాలంభ మని పరవశతఁ బ్రేలఁ
జేసి తనవికారచేష్టలు విరహుల పైఁ బెట్టి కుకవి విద్వద్వరేణ్య
గర్హితముగ నల్పగాథలలోఁ గూడ, విరసవిరచనంబు విశదపఱచి
నవ్వఁబడును మూర్ఖు నామాటవినఁ డని, మానసికవిచారమూని నప్పుడు. ౪౨౩

గీ. నాల్గువందలయిరువదినాల్గు చెల్లఁ, దరుణమునఁ బట్టినాదుల తలఁపులేక
మొట్టమొదట నష్టాదశమును బురాది, వర్ణనము సేయ మిగత చప్ప నయి యున్న.

శా. నన్నూటిర్వదిరైయిదగుం గుకవి దానంబందు రాధేయు వి
ద్యన్నన్నయ్యను గాంతిఁ జంద్రుని సత్యంబందుఁ గాంతేయుఁగా
వన్నెల్చిన్నెలపద్య మొక్కటిని జెప్పన్ దాత యుప్పొంగి వీఁ
డన్నట్లంతటివాఁడనౌదు నని పేద్యంబిచ్చి లాలించినన్. ౮౨౫

శా. నన్నూటిర్వదియాఱగుం గుకవి హీన ప్రాభవున్ సర్వభూ
భృన్నాథుండ వశేషరాజమకుటశ్రేణీమణీమండలీ
ద్యన్నీరాజితపాదపద్ముఁడవు నాఁ డబ్బిబ్బుగా నిక్కి యి
చ్చె న్నాలుగ్గవి కాతఁడేమిగని యంచు న్నవ్వు నావెట్టికిన్. ౮౨౬

శా. నన్నూటర్వదియేడగుం గుధని చెంతం దుష్కవుల్ నిచ్చలుం
జిన్నంబో చిదురో గ్రహించుచును నిచ్చెం గంధమాతంగసం
పన్నంపౌ నమితార్థమంచుఁ బొగడన్ వారెట్టురా వచ్చు నిం
ట న్నారీమణిఁ జూడఁ దేటపడు బండారంబు సర్వంబు నాన్. ౮౨౭

శా. నన్నూటిర్వదియెన్మిదింటఁ గవి కాంతావర్ణనాసంగతిం
గన్నుం గాలును గేలు మోము కచముం గంఠంబు నొండేమి యొ
ల్ల న్నీచంబుగ వస్త్రహీననటు లల్పంబైన శంకింప కె
న్నెన్నో రీతుల వ్రాయు సాహసముగాదే యంచు ఖేదించినన్. ౮౨౮

శా. నన్నూటిర్వదితొమ్మిదౌ కవి సతింగన్నెత్తి వీక్షింప కి
ట్లున్న న్భావ మదెట్టులైన రుచిగాకున్నం దమ నూహింప కుం
డు న్నీలాభ్రము కొండపై గగనముండుం గ్రింద ద్వీపంబు మీఁ
ద న్నాగం బెగఁబ్రాఁకునంచు నతివింతల్ వ్రాయున ద్వెంచినన్. ౮౨౯

క. నాలుగువందలముప్పది, శాలురకుం జదువుచెప్ప బడియొజ్జలకున్
నాలుగుబడులున్ గణితము, చాలఁగ రావనుచు వెట్టి సంతాపింపన్. ౮౩౦

క. నన్నూటముప్పదియునొక, టన్నది నెగడును గురుఁడు పదార్థ మెఱుఁగకే
చిన్నలఁ జదివించుసురా. యెన్నఁడుఁ బుస్తకము ముట్టఁడే యనిపలుకన్. ౮౩౧

క. నన్నూటముప్పదియురెం, డన్నది యొకవెట్టి యొజ్జ యామరము చెప్పం
దిన్నెల బడులం బాలుర, కు నొన్నె రెటులిరుగు ననుచుఁ గుంచెడుచక్కిన్. ౮౩౨

క. నన్నూటముప్పదియుమూ, డన్నిసువుల కర్థమెడపడన్ గీర్వాణో
క్తి న్నేర్పుదు రయవారిక్, తిన్నఁగఁ దెలియని పటంచుఁ దికమకనొందున్. ౮౩౩

గీ. నాల్గువందలముప్పదినాల్గు బోధ, నమ్ము సరిలేక బాలుఁ డజ్ఞానమునను
బడికిఁ బోకున్న గంజిగావడులు వేసి, మోసికొని పోదురని దుఃఖమును వహించు.

క. నన్నూటముప్పదేనది, గున్నఁడు చదువఁడని గోడకుర్చీ వేయిం
పన్నవ్వుచుఁ దలకెక్కని, తెన్నున సేర్పఁదగవంచుఁ దివురుం దిట్టన్. ౪౩౫

క. నన్నూటముప్పదాఱగు, చున్నది చెప్పనదిలేక యూరక కొట్టం
జిన్నలు పంతులుఁ గొమ్మకుఁ, దిన్నఁగ వ్రేలాడఁదీయుతివుటం గనినన్. ౪౩౬

క. నన్నూటముప్పదేడగు, నెన్నాళ్లు పఠింప మెదటికెక్కక విసుగం
గన్నాలికోపమున గురుఁ, డన్నా కోదండమెత్తురా యనిపగవన్. ౪౩౭

క. నన్నూటముప్పదెనిమిది, టన్నిలునదె యాటవిడుపుడబ్బులకై యే
పున్నమ యమావసయును గా, కున్నను సెలవిచ్చు నొజ్జయూహల నెన్నన్. ౪౩౮

గీ. నాల్గువందలముప్పదినాల్గు మీఁద, నైదవది పెట్టి యక్షరాభ్యాస మనుచు
గిలుకలంచును సొమ్ములు గిలుబులాడు, కొందు రిసుమంత చెప్పరు కొండొకలకు.

క. నన్నూటనలుబదింటను, జిన్నంబోవుచును నిల్చి సీకంటం బం
చున్నడివె మణుఁగునాలిక, యన్నాఁ డని చదువురీతి యానయువోటన్. ౪౪౦

క. నన్నూటనలుబదొక్కటి, యన్నది బడిపంతులగుట యతిసులభం బం
చున్నిసుఁగులతో నఱచుచు, నున్నంగని యొజ్జనవ్వు నొక వెట్టియగున్. ౪౪౧

క. నన్నూటనలుబదియూరెం, టన్నరు లవ్వాని కేమిటంగొడవగు నే
తిన్నెనో బడిపెట్టు నటుం, చున్నిరసన నొజ్జతనముఁ జూచిన నిలుచున్. ౪౪౨

క. నన్నూటనలుబదియుమూఁ, డన్నది నాఁటికిని నేఁటి కావిధమున నే
యున్నదిరా పంతులుతన, మన్న మనోవ్యాధి విబుధునంటినఁ దోఁచున్. ౪౪౩

గీ. నాల్గువందలనలుబదినాల్గు గుంట, యోనమాల్ వ్రాయురా యని యొక్కకేక
పెట్టి తగవర్లతో నూరిపెత్తనంబు, నడపుగురువులఁ గని పెద్దనవ్వు పెట్టి.  ౪౪౪

క. నన్నూటనలుబదేనగు, నన్నిగురుధిక్కృతికి జనంబులు నిందిం
పన్నెలవుచేసి విడిచిన, యన్నిరసగర్వవిహ్వలి యనియరయుండా. ౪౪౫

క. నన్నూటనలుబదాఱగు, తిన్నెలపై బడుల యొజ్జ తేరి హరికథా
భ్యున్నతిఁ బాటలుఁ బద్దెము, లన్నిలుకడ మాలి బిడ్డలను విడునేనిన్. ౪౪౬

క. నన్నూటనలుబదేడగు, చున్నది హరికథలు చెప్ప చొఁగి గంతులిడన్
మిన్నందు నాట్యశాస్త్రము, నున్నవకవనంబు దనకునుం దొరకెననన్. ౪౪౭

క. నన్నూటనలుబదెనిమి ద, గున్నాటకసంఘములను గొన్నాళ్లున్నం
తన్నేన నాటకమువ్రా, యన్నిపుణుఁడ ననుభవమున ననునజ్ఞానికిన్. ౪౪౮

గీ. సాల్గింపంబలనలువపడిసాల్గినైరు, వెట్టి యొసలారు దేవకీవిభుఁడు దశర
థుండు రాధామనోభిరాముండు రాముఁ, డనెడువేల్పులు పండితు లైనకడల. ౪౪౯

క. నన్నాఁటేఁబదిలో వ్రా, యన్నేరఁడు కసల ధథల నరయంజాలం
డెన్నఁగ రా ౘ్రెండేటికి, సున్నలు రెండేల యనుచు శూన్యహృదయతన్. ౪౫౦

శా. నన్నాఁటేఁబదియొక్కటిం జడుఁడు మానం బెట్ట నేమయ్యె నీ
సున్నల్ రేఫలు చేతగావొ పనిమాల్పున్ వ్యర్థవాదం బటం
చున్నే వీడి లిఖింతు నంచిడు విసంధుల్ దుష్పదగ్రామమున్
ఖిన్నంబోఁ డిది చేతనైన షనియో నీ ఘుంచుఁ దానవ్వెడున్. ౪౫౧

క. నన్నాఁటేఁబదిరెండగు, చున్నది యెవ్వనికి నెట్టు లూహాసహనము
దున్న నదియెల్ల లౌకుల, కు న్నేర్పెడునట్లు సభల గోడౌనరింపన్ ౪౫౨

శా. నన్నాఁటేఁబదిమూఁడగుం గుకవి గంటం బాకుఁ జేఁబూని చే
రు న్నీవింద్రుఁడ వెందు నన్నిటఁ గుబేరున్నింతు వం చర్థి పో
నిన్నేవ్వారిటు పిల్చి రంచుఁ బలుకన్నీమీఁద నేనిప్పుడే
సున్నమ్మాఁడిడి పస్తునుల్లైవ నటంచున్నించి వాయాడినన్. ౪౫౩

శా. నన్నాఁటేఁబదినాల్గు లోభి కవికిం దమ్మంబు ధర్మంబు చే
యన్నేరం డది దోషమం చనఁగఁ పద్యంబొక్కటిం జెప్పినన్
నన్నేరా విషమాక్షరంబు లిడి మన్నంజూడవం చీసడిం
చు న్నేర్పాఁ గద తప్పకోలుఁదనమంచున్నవ్వు నావెట్టియా. ౪౫౪

శా. నన్నాఁటేఁబదియైదు తొల్లినృపులం బాండిత్యవైదగ్ధ్యసం
పన్నుండే చని కోరువాఁ డతనికిన్ మన్నించి కావ్యంబు లీ
యన్నిర్వాహకమాచునుండె నివు డోయన్ సర్వులుం గోరుమం
బన్నంబు ల్వఱుప న్మగించుకొని రావ్యాపాగమం చెన్నినన్. ౪౫౫

శా. నన్నాఁటేఁబదియాఱగున్ ధని కవి న్నారీతినే శక్తివై
న న్నీకీగతి పట్టవంతుఁ గవివైన న్మప్తియా పొమ్మనన్
విన్నంబాటునఁ బోవుచున్ హరిహరీ విద్యాంను నీకాలమం
దున్ని ర్మించితి వేల యంచపలు చోఁ దోలెంచు వెట్టింగనన్. ౪౫౬

శా. నన్నాఁటేఁబదియేడగుం జగతిలోన న్మామ నల్లుండు నా
కెన్నండున్ బహుమానమీయ వని దౌహిత్రు న్విచారింప వం
చున్నీకూఁతున కంగదంబు లిడవంచుం బెట్టు కష్టంబు ల
ల్క న్నానాఁటికి బెట్టు పట్టుదలలుం గయ్యంబులై మించినన్. ౪౫౭

శా. నన్నూటేఁబదియెన్మిదౌ సతతము న్నాకేమి యు న్నామ ముం
డున్నన్ లాంఛనముల్ త్యజింపఁ దగవె ట్లోహో జనుల్ నవ్వరా
నన్నుం బిల్వఁడు రూక కోక యనఁ డన్యాయ్యం బటంచు న్సదా
యెన్నోరీతు నల్లుఁ డెప్పుడును గర్హింపం గనుంగొన్నచోన్. ౪౫౮
శా. నన్నూటేఁబదితొమ్మిదౌ జగతిలోనం గల్గునాచారముల్
సన్నంబౌ నిఁక నల్లుఁడన్న పదమే స్వారస్యహీనం బగున్
చన్నుం బట్టి యకీర్తి నాకగు నె పూనం బొమ్మటన్నట్లు వె
ట్టు న్నానావిధబాధ లల్లుఁడని యొళ్లు న్వ్యాప్తి చింతించినన్. ౪౫౯
శా. నన్నూటర్వది నేను గాళికరుగం గా నుంటి శీఘ్రంబుగా
నిన్నూ యంపుఁడు మంచితోడుగల దీరేని న్పరే నేఁటితో
నన్నున్ విస్మృతినొందుఁ డాత్మజను మీనారాయణుం బంపి మీ
రెన్నండేఁ గొనిపొందు మానుఁ డని యేమేమేని రక్షించినన్.  ౪౬౦
క. నన్నూటర్వదియొక్కట, గున్నె నిదివఱకు నల్లుగుణము లవెల్లం
జిన్న యొకపాత్ర మమరిచి, యు న్నేఁడిటఁ బల్కు దాని యుచ్చ్రయ మడఁగన్.
శా. నన్నూటర్వదిరెండగు న్నరులలో నానావిధంబై వచిం
ప న్నల్వు ర్వనిలేనిపాటఁ యుడికింపం గింకచేఁ దిట్టుటన్
సున్నం బంచన నూదినా కల మనన్ సోలన్న నందేమి యౌ
తన్నన్నట్లు స్వనీచకార్యస్మృతిచేతం గొంద అల్లాడినన్. ౪౬౨
శా. నన్నూటర్వదిమూఁడగుం బలుకువో నానావిధాభ్యాసముల్
విన్నావా మఱియేమి కావునను గోవిందా కుడా నేను జె
ప్పన్నీకర్థముగాదె చూడు మిదిగో బాగున్నదా యోయి వ
చ్చినన్నీ దైవము మేలుచేయు నగునా చెప్పండు నా నెల్లెడన్. ౪౬౩
సీ. నన్నూటయఱువదినాలుగగును దురభ్యాసముల్ నరులు జిహ్వాతుదగఱచి
కొనుట మీసంబులు గొఱుకుట యెడమచేవాసనచూచుట వాతెఱ యుగి
లించుట గోరులు లీలగాఁ బంటనొక్కుట గోళ్లు మీఁటుట కూరుచుండి
పాదమాడించుట పలుమాఱుచంకలోఁ దొడలోనఁ జేపెట్టి పుడికికొనుట
బుజమెగురవేఁత కన్నుగిర్పుటయు మిటకరించుటయు గొంతుకను సవరించుకొనుట
ముక్కునొక్కులు చిటికెలు ముక్కుటయును, గఱము చెవినిడి త్రిప్పుట గఱచుటయును
శా. నన్నూటర్వదియైదగుం జెలివి భగ్నం బయ్యు వాక్షుద్ధి యు
త్పన్నం బయ్యు మనస్సు నిల్వకయు మంత్రంబుం బఠింపన్ వనా

సన్న్యాసవాసము చేసి సాత్త్వులకు రక్షల్గట్టి నుప్పొంచు మా
ద న్నేత్రంబుల కంజనంబు లిడ నేతద్రీతిఁ దాఁ జెడ్డవోఁడా.

శా. నన్నూటిర్వదియాఱగు న్స్వప్నములోనం గల్గు వేశ్మాలికల్
పొన్సు స్వాండిసి రాగి భస్మముగ నేర్పుల్మీరఁ గావింపఁగా
నున్నట్ బంగరు సేయవచ్చు నని కొంపల్గుల్లగా సర్వముల్
సన్నాసు ల్గాన నేదప్పు వారి ముఖవాసన్మూర్తి యా వెఱ్ఱికిన్.

శా. నన్నూటర్వదియేడుగా వఱలు బంగారుం బ్రకల్పించువా
గన్నారా సుతరాము నమ్మకు మనల్ హులం లేకపోలేదు వా
రున్నారంచును విశ్వసించు నెపుడే నొక్కండు తద్రీతి సౌ
ఖ్యౌన్నత్యమ్మును గన్నవానిఁ గన కాకాంక్షించుచు న్వెఱ్ఱిగాన్.

శా. నన్నూటర్వదియెన్మిదై చను సువర్ణప్రక్రియ ల్గల్గవో
సన్నాసు ల్మిముఁ జేర నేల యెపుడే సంసారిపావాస మే
లన్నం బాములవాఁడు రూప్యములఁ జేయన్లేవొ వాఁ డట్టివిం
గొన్నం జేతను నిల్వ వ ట్లెసఁగుట లో కుబ్బాంపఁ గాంక్షిం త్ర నన్.

క. నన్నూటర్వదితొమ్మిన, గున్నికొంగంబు రాళ్లకున్మొక్కినఁ బో
వన్నెరదు దర గాకడ, కున్నడువుమటంచుఁ జెప్పు గురునమ్మినచోన్.

క. నన్నూటడెబ్బనగుఁ దా, నున్నది యని నమ్మి చేయు నొకయుద్ధుం జే
కొన్నదితే దని తలఁపక, యున్నది ముందనుచు వెఱ్ఱి నూఁగాడంగన్

క. నన్నూటడెబ్బదొకటగుఁ, బన్నగములు గఱవ నరుల బ్రదికింతు నన
గొన్నారె వారిమాటల, నున్న న్సత్యంబు విడుతురో బుధులనఁడేన్

క. నన్నూటడెబ్బదియు రెం, డన్నది జ్ఞానోపదేశ మని యజ్ఞానుల్
కన్నియల మోసపుచ్చుటఁ, గన్న న్నిన్నకయ యుండుఘను నలమిత్రో

క నన్నూటడెబ్బదియుమూఁ, డున్నది వంచనసుపేర నుద్రిక్తముగా
నెన్నివిధంబులఁ జెప్పిన, నున్నానని తోఁచు మునిగియుకుండఁగ నెంచ

గీ. నాల్గువంచలడెబ్బదినాల్గువర్త, కమునఁ గ్రయవిక్రయంబులఁ గలుగు తత్
కలను గొల్తలమోసము ల్గలగలపులు, మాటమెలఁకువలును నిందు మా

క. నన్నూటడెబ్బదేనుగ, మన్నుం బెడ్డలును గలిపి మంచి వటంచుం
గన్నుల్గుగట్టు బేహారుల, సన్నిధి నెల్లపుడు నిలుచు సాధారణమై.

క. నన్నూటడెబ్బదాఱగు, చున్నది యొకదానిఁ జూపి యొక టిచ్చుటల
నన్నరుల కెఱుకపడకుం, డన్నేర్పున మోసగించునటనలయందున్.

క. నన్నూటడెబ్బదేడగుఁ, గొన్నప్పుడు పంచిదిగను గొనిపోయినయం
తన్నిచుకంపుగొట్టెదు, విన్నను వువ సరకులమ్ము జేరుల నేర్పల్. ౪౭౭

క. నన్నూటడెబ్బదెనిమిది, యన్నది మన మమ్మఁబోవ నడవియుఁ గొనఁబో
వన్నీరసంపుఁ గొలవిఁదు, నన్నట్టులు చేయు సెట్టి వ్యాప్మతి యయ్యెన్. ౪౭౮

క. నన్నూటడెబ్బదికిఁ బయి, నన్నవపరిమితము హెచ్చి నష్టము నష్టం
బున్నను మీకిత్తు నటం, చు న్నిజభావమున కెచ్చుచొప్పున నమ్మన్. ౪౭౯

క. నాలుగువందలయెనుబది, కోలం గొను నమ్మ దాని గుండెత్తునకున్
గ్రాలఁగఁ బ్రవ్వకోలం గొను, గోలును మనకమ్మ బోడకోలబేరంబున్. ౪౮౦

క. నన్నూటెనుబదియొక్కటి, నిన్నసె వచ్చినది సరకు నీకొఱకై నేఁ
డెన్నలు చూచెద వాడుక, యున్నప్పుడు పరుల కమ్మనోప వటన్నన్. ౪౮౧

క. నన్నూటెనుబదిరెండగుఁ, గొన్నవెలకె యమ్ముచుంటిఁ గ్రొత్తసరకు రా
నున్నది స్థలసంకోచం, బన్నగిడుం బనుచు శెట్టి యొస్గున నొసఁగన్. ౪౮౨

క. నన్నూటెనుబదిమూఁడను, చున్నది పెస లడుగ నంచియములవలు గలవం
చున్నానె యడుగ నాముద, మున్న దిటంచును వచించు యుక్తులయందున్. ౪౮౩

క. నన్నూటెనుబదినాలుగు, సొన్నారియు ముచ్చె సాలె సారిది స్వకృతులం
దున్నెఱపు మోసకృత్యము, లన్నాగతులఁ జూడ లత్యం బబ్బున్. ౪౮౪

క. నన్నూటెనుబదియైదునఁ, బొన్ననఁ బిత్తళియు రాగి పాదగుబలో నా
విన్నాణంబులు విశదము. గు న్నరులకు లక్క గేడగొడవలు విన్నన్. ౪౮౫

క. నన్నూటెనుబదియాఱగు, చున్నది మనమిచ్చినట్టి సుస్నిగ్ధపుఁదో
లు న్నాఁచికొనుట యట్టులు, మన్నను మాదిగలు పెట్టి మాటుటగనినన్. ౪౮౬

క. నన్నూటెనుబదియేడగు, నన్నవస్త్రములు నేయ సంచకరం బీ
యన్నెనసి తెచ్చి దుప్పటి, కన్నులు సాలీఁడు వులుముకాలంబునకున్. ౪౮౭

క. నన్నూటెనుబదియెనిమిది, మున్నే యెఱిఁగియును మోసపోయిన జనమీ
యన్నివిధంబుల పనివాం. డ్రన్నేరిచినట్టివారు ప్రహసింపంగన్. ౪౮౮

క. నన్నూటెనుబదితొమ్మిది, పన్నగఁ బైగతులఁ బరుల వంచించుటగా
కెన్నితెఱంగులొ యిలలో, నున్నవి తముదామె మోస మొనరించుకొనన్. ౪౮౯

క. నన్నూటతొంబదియగుం, గన్నులు గలిగియును నంధుగతి నటియింపం
గన్నడవఁగలిగి యవిటి న, టన్నన్ ధనకాంక్షఁ బొట్టకై లోకమునన్. ౪౯౦

క. నన్నూటతొంబదియునొక, టన్నది కాసునకుఁ బాను నఱుతం దాల్పన్
మన్నెత్తి నోటఁగొట్టుకొ, న న్నెత్తిని గోచు లిడికొన న్సిగ్గిడియై. ౪౯౧

క. నన్నూటతొంబదియురెం, డన్నది ముండ్లపయిఁబండి యాదలఁ గుంప
ట్లన్నిలిపికొనుచు డబ్బున, కున్నరులాడఁబడుట తెలిసికొనఁబడు నెందున్. ౪౯౨
క. నన్నూటతొంబదియుం మూఁ, డన్నది తల యిసుకలోన నడఁచికొనుట మీఁ
దన్నిప్పుల ప్రొయిపెట్టుట, యెన్నియు లాడితెందు కమవు హేతువున నగున్. ౪౯౩
గీ. నాల్గువందలతొంబదినాల్గు వెట్టి, తిండిలేకున్న నొకమూలఁ దండి చావ
కంగనయుఁ దాను వెలువడి యంగడులకు,సూత్రపాషాణబంధనాపాత్రునొందు. ౪౯౪
క. నన్నూటతొంబదైదిటఁ, దిన్నని యంగములు విఱిచి తికమకగా ని
ల్చు న్నాలుక శూలముగ్రు. చ్చు న్నిడుపగు కత్తిఁ గుక్షిఁ జొనుపుకొను శివా. ౪౯౫
క. నన్నూటతొంబదాఱిట, నెన్నెన్నియు ఱాళ్లు క్రింగు నేదుశలంబుల్
ది న్నేత్రంబుల సూదులి, డు న్నాసామార్గమునఁ నిడుకొనున్నైకుల్. ౪౯౬
క. నన్నూటతొంబదేడగు, మన్నది యాచనకు నాశ కొకయం తనితే
కున్నను దరిద్రు స్థితి సం, పన్నన కెఱుకపడకున్నపట్టున జగతిన్. ౪౯౭
క. నన్నూటతొంబదెనిమిది, యిన్నెఱి యాచనకుఁగాక యేసిద్ధుఁడ నం
చున్నిఖిలవస్తువులుఁ దిను, చు న్నగరములందు సభలఁ జొచ్చునరులదొ. ౪౯౮
క. ఏకోనపంచశతమగు, నేకారుట ధనికుఁగాంచి యూరస మెత్త
న్నాకింత యీయఁ డడిగిన, నేకృతి కదుగక యొసంగు నీతం డనినన్. ౪౯౯
క. ఏనూఱుపాలుచు లబ్ధుం, డీనేరం డరుదెవ్వులున నెత్తి నవరుచుల్
దానైఁ దినం జాలఁడు, వీనికి నర్థికిని గలదె భేద మ్మనుచున్. ౫౦౦

ఇది పంచమశతకము.

---

## షష్ఠశతకము.

గీ. అయిదువందలయొక్కటి యఖిలరోగ, ములకు నొక్కటియేమందు మూలికాన్వి
తంబు సిద్ధోపదిష్టంబు తడయ మించు, వేగిరింపుఁ డటం చనువెజ్జువెట్టి. ౫౦౧
గీ అయిదువందలరెండు దివ్యౌషధంబు, రాజ్యమును నిల్పె నిది యొకరాజునకును
బుత్త్రుఁ డుద్భవమయ్యె నపుంసకులకు, వంధ్యలకు సేవ్యమను వెట్టివైద్యునందు. ౫౦౨
గీ అయిదువందలమూఁడు మాయౌషధంబు, వెల సరస మొక్క నెలదిని ఫలములేక
పోయినను మందుఁబంపించివేయుఁ డిచ్చి, పంపెదము మీధనం బనువైద్యువెట్టి. ౫౦౩
గీ. అయిదువందలనాలు గీయమృతతుల్య, సిద్ధసంకల్ప మేమియుఁ జేయు దెంత
దిన్న రుచ్యము పిల్లలు దీనివాడి, పోయిగాంతురు రసియొడు సూర్ధ్యార్థ మగును. ౫౦౪

గీ. అయిదువందలయైదగు వంటౌషధంబు, నాఱువత్సరములక్రింద నూజివీడు
ప్రభువుచేయించె నేనుసంగ్రహముచేసి, నాఁడనని నల్లమట్టియుండల నొసంగ. ౫౦౫

గీ. అయిదువందలయాఱు నూయయ్యతాత, చేతఁ జేయించినారు మాజేటివారు
డబ్బుకక్కుశిలిని మీకడనును దెచ్చి, నాఁడ నన నెత్తుకొయి మందమతి గొనిన.

గీ. అయిదువందలయేడిది యష్టమూర్తి, యొక్కమూలను గోసిన నొక్కరోగ
మునను మందని యెనిమిదిమూల లున్న, రంగుతాలిని జాఫ్రనార్భటము నమ్మ. ౫౦౭

గీ. అయిదువందలయెనిమిది యడుగడుగున, కొక్కశ్లోకంబు చదువుచు నూటిలోనఁ
బానకము గల్పి యమ్మి తుపాకిప్రేటు, నకును దొరకని వైద్యువంచనకుఁ బట్టు. ౫౦౮

గీ. అయిదువందలతొమ్మిది యధికునాశ్ర, యించి నీమూలమునను జీవించువాఁడఁ
గాగితము వ్రాసియిమ్మనఁ గాలఁదన్న, కనుఁగదా యని యట్టిచ్చు నతనిఁబట్టు. ౫౦౯

గీ. అయిదువందలపదియగు నష్టదీయ, మాతులులు వాగ్భటుని మేనమామకొడుకు
లకును మిత్రులు నాఁటిలోలంబరాజు, నాను సాక్షాత్తు తాత యన్రజ్ఞులాడ. ౫౧౦

గీ. అయిదువందలపదునొకం డగును వైద్యు, నిరుగుపొరుగుల వసియించు హేతువున నె
వేత్త నని విఱ్ఱవీఁగుచుఁ వేరులమ్మి, పొట్టపోసికొనంజాచు పురుషునంటి. ౫౧౧

గీ. అయిదువందలపండ్రెంట వ్యాధిగుర్తు, పట్టఁజాలఁడు మాత్రకుఁ బాళ మెఱుఁగఁ
డెఱుఁగఁడు విఱుగుడులు దీని కొంతసేవ, టంచు బలురోగముఁ గుదుర్ప నడ్డువచ్చు

గీ. అయిదువందఁ పదుమూఁడు హానికరము, లైన నాభిని ఖర్జూరమనుచుఁ బసుపు
కొమ్ము రీతిని పాషాణము మ్మదించి, యొకరనిద్దఱిఁ జంపి వైద్యుఁ డగునేని. ౫౧౩

గీ. అయిదువందలపదునాలుగగును శిష్యు, గొట్టముం దెమ్మనెడు వైద్యకోవిదుండు
మసల శతమారియు సహస్రమారి యగుచు, శమనునకుఁ గొంత చేయూఁత నల్పెనేని

గీ. అయిదువందలపదునైదునందు వైద్యు, నార్తు లడిగెద రేరోగ మనుచుఁ గాఁక
దారుణము తగ్గుటకుఁ గాను దరుణభాస్క, రమ్ముఁ జేర్పుఁడటంచుఁ జిత్రమ్ముగాఁ

గీ. అయిదువందలపదునాఱునందు రోగి, నిన్నఁ గాఁకరకాయలు దిన్నకతన
శ్లేష్మకారకమయ్యెను శీతభేది, నల్లపొట్లమ్ము లిమ్మను నాటువైద్యు. ౫౧౬

గీ. అయిదువందలపదునేడునందు వ్యాధి, దొరకువడ కోహటించు సందుగ నపథ్య
ములను జేయుదు రెవరి సేఁ బిలిచికొందు, తీయమందులు లేవని తిరుగఁబడిన. ౫౧౭

గీ. అయిదువందలపదునెన్మి దందవేసి, కొన్నచేతులు చాలించికొన్నపిదప
నేను జేపట్టి యొకమాత్రలోనె లేవఁ, దీసినాఁడ నటంచును దెల్పుచోట. ౫౧౮

గీ. అయిదువందలపందొమ్మి దల్పరోగ, మైనఁ బెద్దగఁ జెప్పి నే నౌషధంబు
చేయువలయును దెమ్మని చిల్లరగను, దినదినంబును గడియించు తెరువునందు. ౫౧౯

గీ. అయిదువందలయిరువది యగును దీని, కెంతసే పింతలోనఁ దగ్గింతు దోష
పంచితంబును దెచ్చెదఁ బట్టి రాక, లిండనుచు గుంజుకొనిన వైద్యుండుధనము. ౫౨౦

క. ఏనూటిర్వదియొక్కటి, దీనికి భయపడకుఁ డేను దెలిసితిఁ గిటు కి
ద్దానికిని మందుఁ జేసెద, మానినపిద పిండు రండు మాపటి కనినన్. ౫౨౧

శా. ఏనూటిర్వదిరెండగుం బెరటిచెట్టైన్నందు మందౌనె నే
నైనా ప్రక్కనె పెద్దపేరుగలవానిం బిల్చినా కారయం
చానాఁడే యనుకొంటిఁ జూచితిర నాహస్తంబు మందెంత యే
గానింజేయదు చేతినాడె మది ముఖ్యంబంచు బేరంబిడన్. ౫౨౨

శా. ఏనూటిర్వదిమూఁడు దాంభికులు మీ స్మేమార్చి రీవ్యాధికై
యేనాఁడో యొనరించి దాఁచినవి దా మింతైనఁ జేయంగలే
వానాఁ డప్పుడె నూటి వేయఁదగు వైద్యంబన్న సామాన్యమా
నేనీమాడకె మేడగట్టెదనె పోనిం డంచు వంచించినన్. ౫౨౩

శా. ఏనూటిర్వదినాలుగౌ వలదు నేనీచోటికి న్రాను పొం
డే నాచోఁటియె నాకుఁ జిక్కఁగలఁ డేనిన్నాళ్లుగా నుండినన్
నే నెట్టిండనొ కొంత చూచినను దానేరాఁడె మిమ్మంపుటల్
నేనేదో పనిమీఁద బోయితి ననుండీ యంచు భాషించినన్. ౫౨౪

గీ. అయిదువందలయిరువదియైదు సంచి, కట్టునకు శాపమున్నది గడియగడియ
కెల్లచోటికిఁ బోఁగూడ దెల్లివత్తు, నవసరంబైన రాత్రిరం డనుచుఁ బలుక. ౫౨౫

గీ. అయిదువందలయిరువదియాఱు రేపు, సంతలోన గ్రంధ్యాణపుసరకులు గొన
వలయు నేమైననిండు మీజ్వరమునకును, మందు కలువాన వైచితి నందురేని. ౫౨౬

క. ఏనూటిర్వదియేడగు, మానాయన యాజ్ఞ, బేరమాడను బియ్యం
బీనాఁటి కుండు రాతిరి, నేనూరికిఁబోదు నింట నీవలయు ననన్. ౫౨౭

క. ఏనూటిరువదియెనిమిది, యా నాచేనూత్ర-యమృత-మగునది నిన్నన్
వేనూటి చేసి యుంచితిఁ, గానీ యది యొకరికొఱకుఁగా నని బొంకన్. ౫౨౮

క. ఏనూటిరువదితొమ్మిది, నేనందును గోపపడకు నీరసపడినా
మీనాలేహము దినరా, దా నీవే మీయఁగలవు-ధర్మమున కనున్. ౫౨౯

గీ. అయిదువందలముప్పది యన్నిరోగ, ములకు దీనినె లోనికిఁ బుచ్చుకొనిన
వజ్రదేహంబు గాదొకో వట్టినోటఁ, దినిన నిర్బాధకం బని తెలుపు నపుడు. ౫౩౦

క. ఏనూటముప్పదొకటగుఁ, దానొక్కరి కీయవలయు దానిం దీర్పం
డీనేరఁడు నాసొమ్మని, పూని యొరునిట్లు నతనిపోఁడిమి యొందున్. ౫౩౧

గీ. అయిదువందలముప్పది యవలరెండు, వెలయు నొకవెట్టి తనతప్పు వెలికిఁదోఁప
కుండఁ గప్పుచు నొరుతప్పు లుఱక యెన్ను, తీర్పరులఁ బట్టుకొని యతితీవ్రముగను

క. ఏనూటముప్పదియుమూఁ, డౌను గురుండనఁగ లేక యభ్యాసముచేఁ
దానే తనంతవాఁ డగు, నానిపుణుండైన చోరుఁ డనం దగుధృతికిన్. ౫౩౩

క. ఏనూటముప్పదియునా, ల్గౌ నెవ్వరిఁ జూడకుండ నతని కతండే
పో వేర్చు నంధకారము, లో నొక్కరుఁ డెఱుకలేని లోయలగదువన్. ౫౩౪

క. ఏనూటముప్పదేనగు, సేనాఁటను బడులు లేవు హితగురువులు తే
రేనోట వినునో నేర్పులు, స్తేనుం డతినిపుణుఁ డగుట తిలకించినచోన్. ౫౩౫

క. ఏనూటముప్పదాఱగు, సేనని యొరులకును జెప్పకే దొంగయఁ దా
మానవుని పగిది మెలఁగుసు, నానావిధచౌర్యములజనము వంచింపన్. ౫౩౬

క. ఏనూటముప్పదేడగు, నేనిమిషమునందు దొంగ యేయింటికిఁ గ
న్నానం బోదును మఱిగు, మ్మాన న్వాకిటద నటంచు మతియించుకొనన్. ౫౩౭

క. ఏనూటముప్పదెన్మిది, యానొక్కనినిమించి యొక్కహర్త వినోద
శ్రీ నెఱపి పట్టుపగకే, గానంబడ కెల్లవస్తుగణము హరింపన్. ౫౩౮

గీ. అయిదువందలముప్పది దైనవెనుక, తొమ్మిదగుఁ గన్నపుంగత్తి దొరకువడక
యుండుకతమునఁ గన్నగాఁ డొక్కనాఁడు, గత్తి మఱవఁడటం చనుగాథ వుట్టె.

గీ. అయిదువందలనలువది యన్నియెడల, వెలయును బ్రదర్శనంబు లెవ్వాలనఁ జూప
రద్భుతంబుగ సంధిసేయంగ నొదుగు, కత్తి యిట్టిదటంచుఁ జిక్కకయ యేమొ.

క. ఏనూటనలువదొక్కటి, గా నేఁజూచితిని మద్దికాయవలెనె ము
క్కోనములు దేరఁ జివరను, జేసెఁడు బెత్తెఁ డగుఁగత్తి చిత్రంబన నా. ౫౪౧

క. ఏనూటనలువదియురెం, డౌ నొక్కఁడుఁ గత్తిఁజూడ కాలోచనపై
నానాగగనాపసనము, లానైపుణిఁ గట్టఁ జూచి తంచు వచింపన్. ౫౪౨

క. ఏనూటనలువదియుమూఁ, డౌ నూతనచోరుఁ డాయుధాప్తికినై
మానెఁడుబొగ్గులు చబ్బుల, తో నిశఁ గొలిమినిడిచనుఁ జతురత మెఱయన్.

క. ఏనూటనలువదియునా, ల్గౌ నలకమ్మరియు నుదయమైనం గని యె
వ్వానికిఁ దెలియకయుండం, గా నొనరిచి యిడును రాత్రి కమటమున ననన్. ౫౪౪

క. ఏనూటనలువదైదగు, నే నెటి నొరులెఱుఁగకుండ నీపనిచేయుం
డా నలకమ్మరి [illegible] యెవ, రేనిం దలఁతురొకో యనుచు నేడ్చెడు వెట్టిన్. ౫౪౫

గీ. అయిదువందలనలువదా ఱగును బెద్ద, పులియదిగో నన్న నిదిగో నీవలది తొంక
యడెడువారలెగాని యీయవని వాస్త, వంబు నరయ రటంచని పనరువెట్టె. ౫౪౬

గీ. అయిదువందలనలువదే డగునుదొంగ, తనయు నలరాత్రి కడుఁ బ్రేమఁ దల్లిపోఁత
దఱిని రక్షించు దొంగలతల్లి కేడ్వ, భయ మటంచన వీడ నపాయమునను. ౫౮౭

క. ఏనూటనలువదనిమిది, యా నిసి నొకవీథికేగి యరచెడుచోఁ దే
లూనంగుట్టిన నేడ్చుట, మాని కృశింపంగ వెఱ్ఱి మఱిఁగినయేనిన్. ౫౮౮

క. ఏనూటయేఁబదికినొక, టూనంబగు వెఱ్ఱి యెన్నియున్నను ధనమే
గాని స్పృశింపనిదొంగను, మానుగ సమయమది యొక్కమాఱు భజింపన్. ౫౮౯

గీ. అయిదువందలయేఁబది యగును జేఁక, టిని బరులయిండ్ల వెసకి పెట్టినది తీయు
చాడ్వునను సర్వమును గొని చప్పుడేమి, చేయకయ చనుచోరుని చిత్రచర్య. ౫౯౦

క. ఏనూటేఁబదియొక్కటి, యా నుద్యోగములు లేవొ యధికారము లే
దో నమలరాదొ పుల్లెలు, చీ నిసియం దర్థహరణచింతలు తెగడన్. ౫౯౧

క. ఏనూటేఁబదిరెండగు, నౌనో కాదో యటన్న యర్థంబునకై
నానాబాధలు చీఁకటి, లోనంబడి యేడ్చునే ప్రలోభము కలిమిన్. ౫౯౨

క. ఏనూటేఁబదిమూఁడగు, నానుం గనుదృష్టి యంజనాదికమున నం
ద్రినను భటులకు దొరకక, పోనుండెవె మందులనుచు బోధించెడువోన్. ౫౯౩

క. ఏనూటేఁబదినాల్గుం, గానెన్నదు రల్కవడెడు కాలంబునఁ గా
లూనినచోఁ గలయుసుమును, బానుపుపైఁ జల్లి స్వపితు వంచింతురనన్. ౫౯౪

క. ఏనూటేఁబదియైదగు, గానంబడినట్టి వస్తుకాండం బెల్లం
బానుగొని యెట్లుదాఁచునో, యేనెరి సొమ్మగునొ యంచు నెంచెడునేనిన్. ౫౯౫

క. ఏనూటేఁబదియాఱగు, మానిసి చడివట్టి గోడమాటున డాఁగం
బో నూతఁబడిన చోరుని, కానఁడును బుద్ధిరామి కాశ్చర్యముగాన్. ౫౯౬

క. ఏనూటేఁబదియేడు వి, శానాథుఁడు గ్రుంక సర్వసాహాసముల మా
ర్గానఁబడి "బడితివాద్యవి, ధానమున" న్నరులదోఁచు తస్కరుచర్యల్. ౫౯౭

క. ఏనూటేఁబదియెన్మిది, యానొకరిద్దఱను గ్రామమంతయు దు
ర్మానమానూననిందవడు లో, కానం గ్రహచారమనుచుఁ గలఁగెడునేనిన్. ౫౯౮

క. ఏనూటేఁబదితొమ్మిది, యా నుత్సవములను బగటియందే మ్రుచ్చున్
మానుగఁ దిరుగుటఁ జూచియు, మానమి నిశ నట్టిపని ప్రమాదం బనుచున్. ౫౯౯

క. ఏనూటఱువదియగు బరి, కానిం గొని బ్రదుకు నానగండల బ్రదు కి
స్సీ నిందకు నిలయమ్మగుఁ, దానును దత్ఫలముకతనఁ దామసి యగుటన్. ౬౦౦

క. ఏనూటఱువదియొక్కటి, యా నొక్కొక నెలఁత యత్త పెట్టిననగల
న్మానమున నపహరించిన, మానిని నగలాత్మభర్త మఱుఁగుపఱిచినన్. ౬౦౧

క. ఏనూటతొంబదిరెండగు, జ్ఞానాపేతమగు శిశువు కాయంబున వి
జ్ఞానులు నగలందొడిగి య, ధీనము గావించిరేని తెక్కలిగమికిన్. ౫౬౨

క. ఏనూటతొంబదిమూఁడగుఁ, బూనిక నొరుబిడ్డ ముద్దుముచ్చట లని దు
ర్మానలు గొని యొడలంగల, వానిని హరియింప నర్థవాంఛానిరతిన్. ౫౬౩

క. ఏనూటతొంబదినాల్గగు, మానిను లాకకొంద అరవుమార్గము గాఁగన్
నానాభరణంబులు గొని, స్తేనులు హరియించి రనుచుఁ జెప్పిరయేనిన్. ౫౬౪

క. ఏనూటతొంబదియైదగు, నేనాఁడును నెరవుదెచ్చి యిడికొను టది లే
దేని న్మర్యాదకు వెలి, తానో యెరవులవి బరువులన నెఱుఁగరొకో. ౫౬౫

గీ. అయిదువందలయతొంబదియాఱు పగటి, చుక్క రేచుక్కలను జోలుచోరు లవని
మాటలనె మోసపుచ్చు కైలాటకాండ్రు, వర్తకులు వారిప్రక్కఁ బోవఁ గదుహాని.

గీ. అయిదువందలయతొంబదే డగుచు సూత్ర, ములును సంధులు నర్థసముచ్చయములు
బహుళపక్షాగమంబులు స్వార్థపరత, లెన్న మ్రుచ్చిమి వ్యాకరణోన్నతిఁ గను.

క. ఏనూఱ్ఱతొంబదియెనిమిది, తానొక్కనియొద్ద నేర్చి తనకంటె గురున్
హీనునిగాఁ జెప్పుచుఁ బ్ర, జ్ఞానష్టిం దిరుగు మోసగానిం గలఁచున్. ౫౬౮

క. ఏనూటతొంబదితొమ్మిది గా నొక్కనిప్రక్క హంస కాకీయోపా
ఖ్యానముగ మెలఁగి కన్నులు, గానక భుక్తాలయంబు గర్హింపనగున్. ౫౬౯

గీ. అయిదువందలడెబ్బది యగును గురువు, గారు మర్మముచేసిరి కాంచి వెలికిఁ
దెల్పుచున్నాఁడ రండని తెలివిలేని, పనుల ధనమార్జనముచేయు పలుగువెట్టి. ౫౭౦

క. ఏనూటడెబ్బదొక్కటి, యతా నొక్కనిగూడి వృద్ధినంది యనిశమున్
వేనోళ్ల నతనిఁ బొగడచు, నేనూహలు మార్చికొంటి నిపుడని తెగడన్. ౫౭౧

క. ఏనూటడెబ్బదియురెం, డౌ ననవసరమని విడువ నాచార్యుఁడు నే
నేనిపుణతఁ గనిపట్టితిఁ, గానియెడం జగతి లోటుగాదే యనినన్. ౫౭౨

గీ. అయినువందలడెబ్బదినంటి మూఁడు, పొలుచుఁ గసువెట్టి నరు వెమపోటుగాఁగ
దృష్టిదోషాఖ్య మది యెన్ని యేనితెఱఁగు, లగును గొన్నింటి వివరింప నవసరంబు.

క. ఏనూటడెబ్బదియునా, ల్గౌను సదాపరగృహముల నట్టాడుచుఁ ద
ద్ధేనువులనో మానవులనో, పూనికఁ గన్నెత్తిచూచి పోఁదలఁచు నెడన్. ౫౭౪

*గీ అయిదువందలడెబ్బదియైదు కంటి, దెబ్బ తప్పినను గంటిదెబ్బ తప్ప
దనెడుసామెతగా విషమాత్ము లరసి, లేని జెడుఁ గొన్నివస్తువుల్ వృద్ధిలేక. ౫౭౫

---

* కంటిదెబ్బ=ఱాతిదెబ్బ-కంటిదెబ్బ—కన్నుదెబ్బ.

గీ. అయిదువందలడెబ్బదియేఁడు కంటి, కంటెఁ జేతాఁకు చెడ్డది గలదు పాడు
కాయ యొక్కండుగోసినఁ గాయ దింకఁ, జీడపట్టును మిగులఁ బ్రసిద్ధ మిదియు.

గీ. అయిదువందలడెబ్బదే డగును బాలు, పితుకుచుండంగఁ జూడఁ జేఁపినది మరలఁ
జేయు నెగఁజేఁపు క్రిందను చెడును గొడ్డు, చిట్టెఁడీయదు గంపెఁడుచిట్టు దిన్న.

క. ఏనూటడెబ్బదెనిమిది, యగా నొక్కనిదృష్టిపడిన నావుపాదుగులో
మానెఁడుపాలకు నడ్డెఁడు, గానంబడు రక్త మిదిప్రకాశము జగతిన్. ౫౭౮

క. ఏనూటెనుబదికొక్కటి, యౌను గొఱంతగఁ బచించు నవసరముల నె
వ్వానితో కన్నుపడంగను, జోసది నీరుగనో పెద్దపుర్వులుగానో. ౫౭౯

గీ. అయిదువందలయెనిమిది యగును జిత్ర, దృష్టి తాఁబెట్టు నన్నంబుఁ దృష్టిగా న
మృతసమానముగా నేరికేని వారలు, పెట్టువది చూడ నోపదు వెఱ్ఱితల్లి. ౫౮౦

క. ఏనూటెనుబదియొక్కటి, యగా నేత్రముకంటె మిగుల హస్తముకంటెన్
మానవులదర్శనంబున, జానొక దోషంబు సర్వసామాన్యముగాన్. ౫౮౧

క. ఏనూటెనుబదిరెండగు, నేనూరికిఁ బోవునపుడు నీవెదురైనం
గానేరదు కార్యం బని, మానసమునఁ బుట్టుశంక మఱి యట్లగుగన్. ౫౮౨

క. ఏనూటెనుబదిమూఁడగు, నేనీదినమునను లేచి యెవ్వరిమొగముం
గానంగానో యి ట్టివ, మానం బయ్యెనని చెప్పుమాటలు విని నన్. ౫౮౩

క. ఏనూటెనుబదినాలుగు, మానవదర్శనముకంటె మాటలదోషం
బౌను బ్రయాణముపట్టునఁ, గానంబడు దానిఫలము కడువేగమునన్. ౫౮౪

గీ. అయిదువందలయెనుబదియైదు మీర, లెక్కడికి వెళ్లుచున్నార లెపుడువత్తు
రనిన విఘ్నంబు గావుట నన్యులేగు, నప్పుడెదురుగ రారు మాటాడ రరసి. ౫౮౫

గీ. అయిదువందలయెనుబదియాఱు పిదప, నెవ్వరేమందురో యని యింతిముందు
వచ్చి బిడ్డకుఁ దెండు పావడకుఁబట్టు, పసుపుఁ గొమ్ములు దెమ్మని పలుకుఁ బతిని.

గీ. అయిదువందలయెనుబదే డగును నరులు, పరులఁ గనుఁగొని చేయునప్రలాప
మునకు నాక్షేపమను పేర ముఖ్యవిషయ, ములను గొన్నింటిఁ దెల్పుట మోసగాదు

క. ఏనూటెనుబదియెనిమిది, యానస్త్రావక్రుఁ డంగజాకృతులను హా
స్యానుకృతిం దొంపాడుచుట, దీనం బలుదెఱఁగులుండుఁ దెలియవలసినన్. ౫౮౮

క. ఏనూటెనుబదితొమ్మిది, యగా నెంతప్రమాణముంటి నని తన్నెఱుఁగం
డైనను బొడుగరిఁ ద్రాడని, జానోజీ యనుచుఁ బొట్టిఁ జక్కటులడువన్. ౫౮౯

గీ. అయిదువందలతొంబది యాలయముల, దేధనమును మ్రుచ్చిలు దిట్ట దొంగ
తనముచేసినఁ బుట్టు నిర్ధనుఁడుగాఁగఁ, బాతకమ్మని ధర్మము ల్పలికెనేని. ౫౯౦

క. ఏనూటతొంబదియునొక, టౌ నొక్కని కెంతవానికైనను గొంచెం
బూనముగఁ బల్కకుండిన, చో నిద్దురపట్టకుండుచొ ప్పరసికనన్. ౫౯౧

క. ఏనూటతొంబదియుంరెం, డౌ నుపాంభఃయుఁడు నవ్వ నాయతజఘనుం
గానంగ వెనుకబఱువని, తానెక్కిన బండి కఱకఁ దలఁపండైనన్. ౫౯౨

క. ఏనూటతొంబదియుమూఁ, డౌ నూనెమెఱుంగుకొప్పు టూర్యను జొల్లెం
బూనినవఁ దాకిని నగు, నేని న్నొగసులకుఁ గాలవిదియా యనుచున్. ౫౯౩

క. ఏనూటతొంబదియునా, ల్గౌ నుబ్బినబుగ్గలతివ యవటీటను ఘూ
ణానూన దీర్ఘకంధర, న్యూనతఁ బొడగన్నపట్ల నులుకుచు నుండున్. ౫౯౪

క. ఏనూటతొంబదే న్గౌ, పీనుఁడు గొల్లాయిఁగట్టుఁ బిఱుఁదులు దిగవం
చానఁగ నవ్వినఁ బౌరుఁడు, జానపదుం గేలిసేయ సంసిద్ధముగాన్. ౫౯౫

క. ఏనూటతొంబదా అవ, ధానింగని యాశుకవి వితాయని నవ్వన్
ధీనిధిని యాష్టగాని మ, హానాటకకర్త నట్టహాసము సేయన్. ౫౯౬

క. ఏనూటతొంబదేడగుఁ, జీనాంబరధారిఁ గాంచి చిఱునవ్వునఁ బ్రా
చీనావీతిస్వదేశవ, సానుఁడు సఖుఁ జూచుచున్ దిసంతులుగొట్టన్. ౫౯౭

క. ఏనూటతొంబదెనిమిది, యతా నలగూర్జనిఁ గేరళాంగన ద్రవిడ
స్త్రీని యవని గద్దేహిం, దూ నయమార్గనిధి నలకునుస్మృతిని నగన్. ౫౯౮

క. ఏనూటతొంబదింటికిఁ, బైనొకతొమ్మిది వహించు భావమఱఁదుల
స్నానావమానపద్ధతి, మానింపక చేయుహాస్యమార్గము లెల్లన్. ౫౯౯

గీ. ఆఱువందలయెల్లు బాల్యమున ముద్దు, కొఱకుఁ దండ్రులఁ దాతలఁ గోరతిట్టు
మనుచు నేర్పుదురేని క్రమాభివృద్ధి, నదియ యగుఁ గూసువిద్యగా నర్భకులకు.

ఇది షష్ఠశతకము.

---

## సప్తమశతకము.

గీ. ఆఱువందలయొకటి విద్యార్థు లన్య, బలపములు లేఖనులును జాఁపలును దొంగి
లించి పట్టుపడన్ నాకులేవె బలప, ములును గంటము లనుచును బూకరింప. ౬౦౧

గీ. ఆఱువందలరెంటిలో నస్యపుస్త, కంబు హరియించి నెమలియీఁకలను నాఁచి
దొరకవడి సిగ్గువడి చెడుదురు దురభ్య, సనములను బాలురని వెట్టి చాటిచెప్పు.

గీ. ఆఱువందలమూఁ డుపాధ్యాయు చపర, యెత్తుకొనిపోయి మాయమ్మ యిచ్చె ననుచు
బొంకి పేరున్న దెఱుఁగక బుద్ధిహీను, లపహాసనదుర్వచములపాలగుదు రేని. ౬౦౩

గీ. ఆఱువందలనాలుగౌ నరయ కొఱకరి, వస్తువుల బాలకుండు దేవానినింటి
పెద్ద లర్థార్థులై పెఱవీథి నమ్మఁ, జూపినను బాలు వారింపఁజూడకున్న. ౬౦౪
గీ. ఆఱువందలనైదౌ చితరార్థములను, జూడ నవి తానుహరియింపఁజూచుజాడ
లాదవఁజేసెడు తలఁపను నోర్జగాక, శిక్షకులు లేర నేర్పంగఁ జేయివట్టి. ౬౦౫
గీ. ఆఱువందలయాఱు కన్నట్టిదెల్లఁ, దనకు రావలయునటంచుఁ దలఁచి కాని
కొఱకు బహుకష్టములఁ బడి కొనలుసాగు, నోర్వలేమిని గుందుచో నొప్పువెఱ్ఱి.
గీ. ఆఱువందలయేడగు నల్లకాని, కన్నదని లేదు తనకని యొప్పుచాల
కిరుదెఱంగుల వగచెడు హీనుమనసు, వట్టిహాలార్పు వెఱ్ఱి సుస్పష్టముగను. ౬౦౭
గీ. ఆఱువందలయెనిమిది యగుగునొక్కొ, పరులవిత్త మటంచును బరిగణింప
కెదురుచూచుటచే బుద్ధిహీన మగును, దానిచేఁ బుట్టువెఱ్ఱి కొందఱకు జగతి. ౬౦౮
గీ. ఆఱువందలతొమ్మిది యగుచు వెఱ్ఱి, యొద్దియో లోపముండిన యెడను బట్టు
వసతిలే కూడనింబాడు ప్రజ్ఞ యదియ, కారణం బగుచుండు సాధారణముగ. ౬౦౯
గీ. ఆఱువందలపది చూడనగును దావు, మెదడునకు లేకపోయిన మిక్కిలియును
జిన్నతలతోడఁ బుట్టిన చిన్నవాండ్ర, చేష్టలను వారితండ్రులచేష్ట లరసి. ౬౧౦
గీ. ఆఱువందలపదునొకం డగునుదైవ, మనుకూలముగా నుండుటరయ కల్ల
వారివలె నాకు వలయు నైశ్వర్య మనుచుఁ, బాటుపడి వ్యర్థుఁ డగువాని భ్రాంతి వెఱ్ఱి
గీ. ఆఱువందలపండ్రెండు వ్యర్థశూన్య, వాదముల నాలకించి యపప్రలాప
మాచరించుచు సద్బుద్ధి యాదరింప, నారటంపడ బుద్ధివికార మగును. ౬౧౨
గీ. ఆఱువందలపదుమూఁ డగును ధనికుఁ, డయ్యు సామర్థ్యముండియు నడుగుదాఁట
కాలరుల మాట దుష్కార్యజాలకృతి స్వ, మాన మెఱుఁగక చెడు పరాధీనువెఱ్ఱి.
గీ. ఆఱువందలపదునాలు గగును హంస, లేదు కలిలోన సింహంబు లేదు కాకి
కాదిదియు వేఱుపక్షి నిక్క మగునవిగ, తించె ననుచును దలతిక్క దిరుగకున్న.
గీ. ఆఱువందలపదునైదు దనంత మొడమె, గలదు తెలుగ దటంచు దుష్కార్యపరతఁ
గన్నుఁగానక వావివంగడము లెఱుఁగ, కయును విహరించు దుర్బుద్ధి కయిపుగాదె.
గీ. ఆఱువందలపదునాఱు వ్యవహరింపఁ, బడు ధనాద్యాశ లేవడివలనఁ దనకు
నదివలయు నిద్దివలయు నం చందరాని, కోరుకుల గోరుమనుజుని జేరియుండి. ౬౧౬
గీ. ఆఱువందలపదునేడు వ్యర్థు లన్య, విత్తయువతీప్రలోభంబు వెలఁదు లన్య
విత్తయువక ప్రలోభంబుఁ జిత్తమందుఁ, గలిగియుండుట యాశనాఁ గాంచుఁ బేరు.
గీ. ఆఱువందలపదునెన్మి దగు సహార్శి, శంబులు దరిద్రులు మనోరథంబులఁ గడ
పఁగను వారిచ్చిరేని యీపట్ల నర్థ, వంతుఁడను గానె యని వృథా చింతసేయు.

గీ. ఆఱువందలపందొమ్మి దగుచు దలఁచు, కొన్నిపన్నియు వచ్చినా యెన్నఁడైన
వచ్చు రాకుండు దానితోపాటు విద్య, కై ప్రయత్నింపకుంట నిరాశ యనఁగ.

గీ ఆఱువందలయిరువది యగుఁ బరార్థ, మందుఁ గాంక్ష యొనర్చుట యాసలేని
వాఁడుగలఁడొక్కొ సన్న్యాసివంటివాఁడుఁ, గాంక్షసేయుఁబరార్థసంగ్రహము పొంటె

గీ. ఆఱువందలయిరువదొం డగును బరుల, వలనఁ దాఁ గోరుసర్వంబు వచ్చినట్టి
వస్తువులపైని బెఱయీఁగ ప్రాలనీక, కాచుకొని యుండువానికాంక్ష కగునింద.

గీ. ఆఱువందలయిరువది యవలరెండు, చనును నాకంటెఁ గలఁడె యైశ్వర్యవంతు
డంచును నన్ను దర్శింప కర్థఘటిక, యుండలే రను చిత్తసమున్నతికిని. ౬౨౨

గీ. ఆఱువందలయిరువది యందుమీఁద, మూఁడు నాకంటెఁ జదివినవాఁడు లేఁడు
డొక్కశుద్ధి యయినను వాఁడు విధిలేదు, నన్నుఁజూడక యని గర్వనటన దెలుప.

గీ. ఆఱువందలయిరువది నంటి నాల్గు, విస్తరిల్లును వాఁడెంత వీనిధనము
వీని విద్యయు నెంత నావెనుక నిలువ, నర్హుఁడే యని యెల్లర నవమతింప. ౬౨౪

గీ. ఆఱువందలయిరువదియైదు నీవు, చేయునది యేమి-చెప్పుకో-చేతనైన
నేను రేపేగి సభలోన నిప్పుకాయ, వాట మొనరింతని తిరుగఁబాటు సేయ. ౬౨౫

గీ. ఆఱువందలయిరువదియాఱు బీద, వాఁడు ధనకాంక్షసేయు స్వాభావికముగ
నర్థవంతుఁడు నీచమార్గానుసృతిని, గాంక్షసేయుట తగదని కానకున్న. ౬౨౬

గీ. ఆఱువందలయిరువదే డగునుస్వల్ప, వేతనంబులచే ధనస్పృహ యొనర్చ
న్యాయదీక్షితులైనపరార్థ్య లధిప, లర్థమాశించి లంచంబు లందుకొనిన. ౬౨౭

గీ. ఆఱునూటిర్వదెన్మిది యగును దమకు, లంచములు మాటలాడఁగా నుంచుకొందు
రాంతరంగికు నొక్కని నధిపు లంచు, లోన గుటకలు మ్రింగు నలోభివెత్తి. ౬౨౮

గీ. ఆఱునూటిర్వదియుఁ దొమ్మి దగును నీవు, పక్షమొనరింపఁ జెప్పుదు వారికిచ్చు
నది యటుంచుము నాకెంత యనుచు సంగ, డిని సమారాధనముసేయు ఘనునిబ్రదుకు

గీ. ఆఱువందలముప్పది యధిపు వనిత, జగతిఁబాలింపఁ జను భర్తసన్నిధాన
వర్తులకుఁ గోళ్లఁ గొనిరండు వచ్చునపుడు, నేయిదెం డూళ్లలోన దండియని చెప్ప.

గీ. ఆఱువందలముప్పదొం డధిపుఁ డింటఁ, గుడువఁ బిల్చినచేలుల చెంగులనుగల్గు
ముడియ విప్పెడునట్టి యప్పుడేఁతి ముడియు, విప్పునా సుప్రసిద్ధికి వెలయుఁబేరు.

గీ. ఆఱువందలముప్పది కవలరెండు, మాధవుం డడిగింప శ్యమంతకంబు
వేసిరొకనింద నన్నయ భీమకవిని, విన్నదియులేదు నిందలువేసి రెట్లు. ౬౩౨

గీ. ఆఱువందలముప్పది కవలమూఁటఁ, బాముసకు నంతభయమందఁ డాముగొన్న
రాజునకుఁ దెల్పుటెటు గవిరాఁగ నాత్మ, పదవిచెడకుండ నని మంత్రి భయమునందు.

గీ. ఆఱువందలముప్పది యవలనాల్గు, పండితుఁడు వచ్చె నేని భూభర్త కెఱుఁగఁ
జెప్ప కాస్థానపండితుఁ డిప్పు డసను, యమని పిఱికితనమ్మున నంజెనేని. ౭౩౪

గీ. ఆఱువందలముప్పదియై దగస్త్యుఁ, డద్రియభివృద్ధి నడఁచు టేయద్భుతంబు
వృద్ధికిని రాఁదగినశిష్యు నేపునొజ్జ, యడఁగఁద్రొక్కుట కాక మహాద్భుతంబు.

గీ. ఆఱువందలముప్పదా ఱధికునొద్దఁ, దనకుఁ గలచనవునఁజేసి తగినవాని
గుణము లవగుణములుగఁ జేర్కొని యుపండి, తుం డసూయను దరిఁ జేర్పకుండె నేని

గీ. ఆఱువందలముప్పదే డధిపునొద్దఁ, దనకు వచ్చెడునది నొల్లుకొనుచు నొరులఁ
గూర్చిచెప్పుటకుఁ గుధి జంకు నొకవేళఁ, గినిసి తన కిచ్చుదానఁ దగ్గించునేమొ.

గీ. ఆఱువందలముప్పది యవ్వలనెని, మిదియగు నధికారంబుచే మిట్టిపడుచు
బిచ్చగాండ్రన విజ్ఞుల వెడఁగుఁదనము, తెలియ రవ్వారియుద్యోగబలము వీరు. ౭౩౮

గీ. ఆఱువందలముప్పది యవలఁదొమ్మి, దధికృతులు తమ్ముఁ బండితులాశ్రయించు
టాత్మగౌరవహేతువం చరయ కర్థి, విధమునం జుల్కఁజూచుట వెకిలితనము. ౭౩౯

గీ. ఆఱువందలనలువది యర్థపుండు, పండితుని దీవనల గ్రహింపం దలంప
కాసవడుఁ బొగడించుకో నాత్మయందుఁ, తదజ్ఞు లద్దాని వెంగలితన మనారె ౭౪౦

గీ. ఆఱువందలనలువది యొాలనొకటి, యఖిలవిద్యల మఱపులేనట్టి శాస్త్రి
వచ్చినపుడెల్ల నెవరని ప్రశ్నచేయు, ద్రవ్యవంతునిఁ బట్టు పరాకువెఱ్ఱి. ౭౪౧

గీ. ఆఱువందలనలువది యవలరెండు, బ్రహ్మరాక్షసిపట్టినవానియింట
దండమున నున్నగుడ్డలు తగులఁబడువి, ధమునఁ దోఁచుట చిత్తవిభ్రమ మటంద్రు.

గీ. ఆఱువందలనలువది నంటిమూఁట, నర్థికిచ్చిన నిచ్చి యీయాయకయ పుచ్చి
యూరకుండక కూలిచేయు మని బండి, లాగుమని బుద్ధిచెప్పఁ బ్రలాపమగును.

గీ. ఆఱువందలనలువది యైనపిదప, నాల్గు పరులకు బోధించునయపథంబు
తాను దిగనాడుటొరుల కింతయును దెలియ, దనుకొనుటయజ్ఞతాగుణమం డ్రుబుధులు.

గీ. ఆఱువందలనలువదియైదు తాను, జౌర్యమొనరింపఁగడఁగు స్వజ్ఞానమునను
దాని నన్యులెఱుంగుచో వానియనిత, లంచు టగును మఱపు తెఱ పంచువెఱ్ఱి. ౭౪౫

గీ. ఆఱువందలనలువదియాఱు నశ్వ, రంబగు ధనమ్ముచేకొని రాత్రి పవలు
శాశ్వతంబగు నయశము సంగ్రహించు, కొనఁగఁ దివురుట లాహిరి యనెడువెఱ్ఱి.

గీ. ఆఱువందలనలువదే డగును మాన, మెడలి తలిదండ్రులను వీడి యెవరుచెప్ప
వెనుకముం దెంచ కొరులను వెంబడించి, గుణధనము గోలుపోవఁ జొక్కనకుగులుతు

గీ. ఆఱువందలనలువది యవలనెన్మి, దగును వితీగిననూదియు నంతమందు
వెంటరాదని యెఱుఁగక విత్త మర్థి, కిడక యడుగనిక్రొర్యుల కిడుటమత్తు. ౭౪౯

గీ. ఆఱువందలనలువది యవలఁదొమ్మి, దడుగులంబట్టి ఱాడిన యర్థిఁ దన్ని
కోడిమలం దొంగ తలవట్టి గుంజి యర్థ, రాత్రమునఁ గొన్న ప్రొక్కు-నర్థపతిసిగ్గు.
గీ. ఆఱువందలయేఁబది యగును ధనికుఁ, డర్థులా మీరు మాకంటె నధికు లంద
లును నోసంగుదు రేల్లరకును నొసంగి, చదికిలంబడుదు మనిహాస్యంబు నెరప. ౬౫౦
గీ. ఆఱువందలయేఁబదియగునొకటి, శైవులకుఁ బెట్టరాదని జైనులకును
బుడుకరాదని శ్రీవైష్ణవులకు మాత్ర, ము పిడికెఁడుపెట్టు నెఱదాత మొఱకుఁడనము.
గీ. ఆఱువందలయేఁబదియండ రెండు, ధనికుఁడన నెవ్వరైన యాచనకు వత్తు
రర్థిపులు కరగ్రహాయత్తు లగుదు రనుచు, బెదరుచూపులఁ జింతించు టదరిపాటు.
గీ. ఆఱువందలయేఁబదినంటిమూఁడు, పిసినిగొట్టని తిట్టినఁ జెడచెవి నిడి
పోయెఁ బ్రాణంబులనఁ బీడవోయె ననుచు, మిన్నకుండుట గౌర్వని యెన్ను జగము.
గీ. ఆఱువందలయేఁబది ననుసరించు, నాల్గు లోనికి నర్థిరా నయము చూపి
మాడ యిడి పంపి ద్వారస్థు మాసవేత, నమునఁ దెగఁగోయు దానశౌండగరిమంబు.
గీ. ఆఱువందలయేఁబదే నాభరణము, గుత్తమై తొల్వరాకున్నఁ గుడుపుమాని
యంగములు చిక్క సవ్వలనవధరించు, నట్టిచుసలాగ్రబుద్ధులఁ బట్టువెట్టి. ౬౫౫
గీ. ఆఱువందలయేఁబదా ఱధికు యాచ, కులనీ పండితులని పందువులని యుత్స
వములని వివాహములని యు వడుగు లనియు, విన్న!వ్యయభీతి మైకమ నొత్తిపట్టు.
గీ. ఆఱువందలయేఁబదే డవశ మనెడు, వెఱ్ఱి వ్యసనంబులం జిక్కి విత్తనాశ
మరయ కాపులబోఁధల నాలకింప, కెప్పుడుఁ దదేకనిష్ఠితుం డేనిఁబొందు. ౬౫౭
గీ. ఆఱువందలయేఁబది ననుగమించు, నెనిమిది గృహాంతరావస్థవినక పణ్య
యువతియే ప్రాణ మద్దానియొడలె జగమ, టంచు విహరింప మైమఱ పనఁగఁబడును.
గీ. ఆఱువందలయేఁబది నానుతొమ్మి, దష్టకష్టములంబడి యార్జనంబు
చేసినట్టి ధనంబు డించి చనలేక, తలకడను మాటఁబెట్టుకో దైన్యమగును. ౬౫౯
గీ. ఆఱువందలయఱువది యంతమందు, భూశయనమునఁగూడ డబ్బువిడఁ బ్రాణ
మొడలకుండిన రూప్యము ల్గడిగి నోట, బోసినం బోవు నతనిది మోహ మగును. ౬౬౦
గీ. ఆఱువందలయఱువది నాశ్రయించు, నొక్క టీలోకమెల్లఁ దానొక్కరుండ
సృష్టిచేసినయట్లు నాయిది యు నాది, యనుచు మమకారమందుట కగును బేరు. ౬౬౧
గీ. ఆఱునూఱులమీఁదట నఱువదియును, రెండు నెలలోప లగును బ్రార్తి శత మొక్క
రేఁడుబ్రదికిన రెండు గావే యటంచు, నెవరికోసమొ గడియింప నెంచుచింత ౬౬౨
గీ. ఆఱునూటిఱువదియుమూఁ డగును మించె, మాట యడుగంగ వచ్చిన మార్చు పెట్టు
లందుమే కాని యెందఱకంచుఁ గన్ను, మూసి యోజించుటకుఁ బేరు మూర్ఛయనఁగ

గీ. ఆఱునూటిఱువదియునా ల్గగును దైవ, మా యొసంగఁగరాదె నీవందఱకును
మాపయిని బడ రీదిక్కుమాలినట్టి, ప్రజయనుచు దైవమును బల్కఁ బ్రార్థనంబు. ౬౭౪

గీ. ఆఱువందలయిఱువదియైదు చావ, రాద యాచకు లందఱుఁ బ్రాణభీతి
యేల వారికి నట్లేని నేడిపింప, రనుచుఁ జింతించు టగును గృపాతిశయము. ౬౭౫

గీ. ఆఱువందలయిఱువదాఱగును నిన్ను, నెవరు కొందురో యొకపఱకేని నర్థి
కొసఁగక గడించి చత్తు మొఱ్ఱో ధనంబ, యేమికానుంటి వన దుఃఖ మిలను వెలసి.

గీ. ఆఱువందలయిఱువదే డడుగలేదు, పెట్టలే దేల దైవమా వెంటఁదిరుగు
చుంటి ననుఁజంపఁ దిని పడియుండఁ గన్న, కుక్కైనా యను ధనియనాకులత యొప్పు

గీ. ఆఱువందలయిఱువదినంది యెనిమి, దాధిపత్యంబొ చదువో నాయార్జనమున
కేల ననుజీమల ట్లలయింత్రు చదువ, రులును నధికారు లనిన విరోధ మగును. ౬౭౮

గీ. ఆఱువందలయిఱువదియన్వలఁ దొమ్మి, దగును బాల్యము లేకున్న నంతకంటె
ముందుఁ బుట్టిన నెంతసొమ్ము గడియించి, యుందునో యనఁ బరితాప మొప్పుధనికి.

గీ. ఆఱువందలడెబ్బది యాలుబిడ్డ, లకును బెట్టితి నేఁడింటి నాయమునకుఁ
బాలుపలపుట్టదా వృథా పడితిఁగష్ట, మోర యనఁగఁ బశ్చాత్తాప మనెడివెఱ్ఱి. ౬౮౦

గీ. ఆఱునూటడెబ్బదియొక్క టగును గడ్డి, తింటి నార్జనకై పడియుంటి నొకరి
జోలి నాకేల యనుచు నాజోలికేల, వచ్చు నెఱుఁగదె మిత్తి యన్వానిదిటవు. ౬౮౧

గీ. ఆఱునూటడెబ్బయిరెం డన్నియెన్ని, కలకుఁ దానుండకున్న లోకము నిలువదు
తానె మూలము లోకమంతకును దన్నుఁ, బిలువకుండినఁ జెడునను వెఱ్ఱితలఁపు. ౬౮౨

గీ. ఆఱునూటడెబ్బదియుమూఁ డాదిభిక్షు, మీఁది మీపేరు ముందుండ మే లటన్నఁ
బొంగి పెద్దంకెఁ బద్దులోఁ బొందుపఱుచు, నతనిదార్ఢ్యంబు గాదె సాహసమనంగ.

గీ. ఆఱునూటడెబ్బదియునా ల్గధికదుర్వి, నీతు లెవ్వరో వారి కివ్విం దటన్న
నేను నేనని యెల్లరు నెగువుపీఁట, కాసపడి వచ్చువారిధైర్యము వహించు. ౬౮౪

గీ. ఆఱువందలడెబ్బది యైదు శిష్టు, లకును విందన్న నవినీతులకడ నిల్చి
సాహసులె సిద్ధమగుదు రీసవ్యసాచు, లన్యుఁ జేసెడినాక్షేప మగు నలజ్జ. ౬౮౫

గీ. ఆఱువందలడెబ్బదియాఱు నేన, మద్యపాయిని విటశిఖామణిని వంచ
కాగ్రసరుఁడఁ గులభ్రష్ట ననుచు నెందు, కైన సిద్ధపడం జాలు నదియ యశము. ౬౮౬

గీ. ఆఱువందలడెబ్బదే డగతికుండు, కులముతక్కువపనిచేసి క్రుంగియుండ
కదియ ఘనకార్య మని మీర లంగఱు నిటు, లాచరింపుఁ డనంగ ధైర్యాతిశయము.

గీ. ఆఱునూటడెబ్బదియెన్మి దాపదఁ దరి, యింప దుష్టాన్నము భుజించి యేన కార్య
కూరుఁడ నటంచు లేచుట చూరుమిగిలి, రచ్చలం దెక్కుటగును జొరవ యనంగ.

గీ. ఆఱునూటడెబ్బదితొమ్మిదగు నకార్య, కరణమున నిర్దయశునిఁ గా గణనసేసి
కొనుచుఁ ద్రొక్కెద వనఁగను దిసెవ సేమి, పందె మనువెట్టి దుర్గతియందు రెండు.
గీ. ఆఱువందలయెనుబది యనుచితంబు, చేసి శిక్షితుఁడై యది చింతసేయ
కొక్కడోసెఁడకాదె యం చూర్చి తుడిచి, వేసికొనుటకుఁ ద్రిభువనవిజయ మంత్రు.
గీ. ఆఱునూటనెనుబదియొం డాన్యపథకు, నేవచాపత్యమును దెచ్చి యిట్టిసురుచి
రాంగు నే లోకమునకు సమర్పణంబు, చేసితి నటంచుఁ జూపుట వావి యగును.
గీ. ఆఱునూటయెనుబదిరెం డాలుబిడ్డ, లెవ్వరును లేనివాఁడు నాక్లిష్ట మగును
శుల్కములు దీయుపెండ్లిండ్లు చూడ నిదిశి, లాక్షరమ్మని వల్కఁగా నగు శపథము.
గీ. ఆఱునూటయెనుబదిమూఁ డాంతరంగి, కానవరతాన్యకామినీహారి లేచి
నాగవాసంబుఁ జూడఁ గృష్ణచరితంబు, వినను దశమంబు చదువనం చనఁ బ్రతిజ్ఞ.
గీ. ఆఱునూటయెనుబదినా ల్గనుభవంబు, గలజనము చెప్ప వినక నిష్కారణముగ
దిగి యొనరిచి దండుగఁబడి తెల్లపోయి,నోట వ్రేలిడుకొనుట యనుభవ మగును.
గీ. ఆఱునూటయెనుబదియై దతఁడు చేయు, దాన లోపములున్నవి నేను జేసి
చూపెద నటంచు వల్దన్నఁ జొరవ చేసి, తాను లోపము సేయఁ దొందర యటంద్రు.
గీ. ఆఱువందలయెనుబది యాఱు కన్ను, దెఱవలే దింతలో మించు దేశహితము
చేయువారలు లేరని సిద్ధపడుట, సభల వాగ్జృంభణమ్మును రభస మగును. ౬౮౬
గీ. ఆఱువందలయెనుబదే డెగును బొజ్జ, పచ్చియాఱదు నంకిళ్లు పట్టువిడువ [కతన.
వార్యసభనిల్చి యేమేమొయనఁగఁ బోవు, "నయితె" "యిఖనేమి" యంచుబాల్యమ్ము
గీ. ఆఱువందలయెనుబది యైన వెనుక, నెనిమిదగును గ్రంథములలో నేమి కలదొ
చదువలే దందుకైన నాసక్తి లేదు, శక్తిలే దూహలను మొగ్గు చతురిమంబు. ౬౮౮
గీ. ఆఱువందలయెనుబది యవలఁదొమ్మి, దక్షిగోచర మగుదాని నరయలేఁడు
తెల్పినను గ్రహియించెడు తెలివిలేదు, నూత్నశోధన కొసరుట యత్నమగును ౬౮౯
గీ. ఆఱువందలతొంబది యగ్బరపుడు, నెలకు నఱువదిదినములు గలవటనియెఁ
దోఁచుచున్నది గొణితము తోడుపడును, గ్రహగతికి నంచు నెంచ దూరశ్రవణము.
గీ. ఆఱునూటతొంబదియొక్క టడిగినాఁడఁ, బండితుల నెవ్వరికిని దోఁపదు కవిత్వ
యంబునం గలపదము లెన్నసెడునూహ, నాకులెక్కింపఁదోఁచె నన్నవగు నూహ.
గీ. ఆఱునూటతొంబదియురెం డరుణాగిరి య, దెప్పుడుప్పెనొ తెలియ నింతేని నెందు
జాడదొరకదు గాని శ్రీశైలపర్వ. తం బనాది యటన దూరదర్శనంబు. ౬౯౨
గీ. ఆఱునూటతొంబదిమూఁ డహర్నిశములు, పుట్టి యెన్నాళ్లొ కాలేదు భూమికంటెఁ
జాలనీవల జూడ్డాలసాయమునను, స్పష్ట మని చెప్ప నగును నిస్సంశయంబు. ౬౯౩

గీ. ఆఱునూటతొంబదినాల్గు స్యందనంబు, లేలతాకని రెండేల రాలటంచు
నన్యభాషల నాల్గుమూఁడైన వెఱుఁగ, కాకళించుట విశద మజ్ఞాన మనఁగ. ౧౯౪

గీ. ఆఱువందలతొంబదే నార్యులవలె, కును గలవు తోఁక లవిగదా క్రోఁతినుండి
మానవులు పుట్టిరనఁగఁ బ్రమాణ మనుచుఁ, జెప్ప నాకాశపుఁబురాణ మొప్పు నెందు.

గీ. ఆఱువందలతొంబదా ఱసను మనువు, మాటలే దంతయును వ్రాఁతమాత్ర మేను
సంజ్ఞలును గొన్ని గలవని చంటిపిల్ల, లెఱుక చేయుదు రన బుద్ధిహీనత యగు. ౧౯౬

గీ. ఆఱువందలతొంబదే డగునుదనపి, తామహునికాల మెఱుఁగఁ డుద్గ్రంథకర్త
వ్రాసికొన్నది నమ్మఁ డూరక యపార్థ, ములను దలక్రిందుచేయ దుర్బుద్ధి యగును.

గీ. ఆఱునూటతొంబదియెన్మి దగును బుద్ధ, గయకుఁ బడమట గుహలోని కారుఫలక
లిఖితమును బట్టి తెనుఁగు ము ఫ్లేంటంచుఁ, జూచినట్టులె చెప్పుట చోద్య మగును.

గీ. ఆఱునూటతొంబదితొమ్మి దన్నిటికిని, సరియయినకాల మెఱుఁగరా దిరువదిరువ
దబ్దములు చేర్చిచూడ సత్యమున కంత, దవ్వుగా దని పలుక నిర్ధారణంబు. ౧౯౯

గీ. ఏడువందలవెఱ్ఱియౌ నిన్నిగతుల, సకలసందేహములకు నాస్పదము గగన
హర్మ్యనిర్మితి నందఱు నద్భుతపరి, శోధకుం డని మెచ్చ నిర్వాహకంబు. ౨౦౦

ఇది సప్తమశతకము.

---

## అష్టమశతకము.

గీ. ఏడువందలయొకటి దుర్వృత్తి ప్రబలి, దేహమును రోగములకును గేహముగను
జేసి తన ప్రాణముల కన్యజీవములను, బలులు వేయుట బుద్ధిదౌర్బల్య మగును.

గీ. ఏడువందలరెండు మేనెఱుఁగ కల్ల, రిగను జిల్లరగాఁగఁ దిరిగి కృశించి
బాధపడువాని నింద్రాక్షిభస్మ మొక్క, మండలము పెట్టుకొమ్మన్న మనుజువెఱ్ఱి. ౨౦౨

గీ. ఏడువందలమూఁడు విజ్ఞోడుగాఁగ, సంచరింప సుపరిచితి సంగ్రహించి
నట్టియక్ష్మకు నమవస నర్ధరాత్ర, మునను వేరులు దీయించుకొనెడువెఱ్ఱి. ౨౦౩

గీ. ఏడువందలనాల్గు వేయిండ్లపూజ, రిగఁ జరించెడు మగనాలు మగనియెడల
మర్మమాతంగిపుపవుల మలయజయుతి, నలఁద మిథునానురాగవిఖ్యాతి నొందు. ౨౦౪

గీ. ఏడువందలయైదు నీహ్యాయరోగ, మితరులకు నెక్కకుండ మాయింటికడప
నడుమ మేకుబిగింతును నక్కకొమ్ము, సంగ్రహింపు మటన్న నసాధ్యమగును. ౨౦౫

గీ. ఏడువందలయాఱు నిర్వీడును శని, వాహనాదియోగం బబ్బు బ్రహ్మరథము
పట్టెదరు వెలిఁగెడు కడపట నొకానొ, క వెలుఁ గన్నను బొంగు టుక్కంత యగును

గీ. ఏడువందలయేడు నాకేని వెట్టి, కుదిరిపోయెను దలకుఁ జుట్టెదను దెండు
చేవరోకలి యెవ్వాళో చెప్పనేమి, మూఁడుతలచుట్లు నిలువన ముదురువెట్టి. ౭౦౭

గీ. ఏడువందలయెనిమిది యెల్లరోగ, ములకు నిచ్చెద రక్షరేఖలను గలవు
తాయెతులు నుంగరములు దురాయికట్టు, లనిన నమ్ముట ప్రాణమ్ము నమ్ముటయగు. ౭౦౮

గీ. ఏడువందలతొమ్మిది యెవ్వరేమి, చెప్పినను వానినే నమ్మి చేసి చెడుట
లోనఁ గలతెల్వి గల దనులోన వినుట, లోన లేకున్న నది యొకలోభగుణము.

గీ. ఏడువందలపది యంబటేలు వచ్చె, ననుచుఁ బొంగెడికోడలి కత్తగారు
చేతఁగోలబుజ్జి చూపుట చెలఁగువెట్టి, తెలియఁబడు నెల్లవోఁ బరాధీన మనఁగ.

గీ. ఏడువందలపదునొకం డేమియన్న, నదియ నమ్ముట పార్థివాహారము విష
లిప్తమగునేని యది నెమిలిగని యాడుఁ, బావురము గూయు ననఁగ విశ్వాసమగును.

గీ. ఏడువందలపండ్రెండు వృక్షములను, గూండ్ల సంజీవిపుల్లలు గూర్చుఁ జెమరు
కాకులని వానినేటిలోఁ గలపఁ బాము, లట్లు యెదురీఁదు నని నమ్ముపట్ల జగతి. ౭౧౨

గీ. ఏడువందలపదునమూఁడిపుడు జగతి, హంసలే దని లేదు సింహంబటంచుఁ
జాతకము వెన్నెలందిను జక్రవాకి, రాత్రి ధవుఁబాయు ననుచు నేర్పఱుచువెట్టి.

గీ. ఏడువందలపదునాలు గెసఁగుఁ జిండి, వెట్టి సర్వంబునందును వివిధగతుల
నద్భుతంబు పిపీలికాద్యఖిలగురుని, వఱకు దీనిని గెలిచినవారు లేరు. ౭౧౪

గీ. ఏడువందలపదునైదు పృథివిమొదలు, పంచభూతమ్ములను మ్రింగఁ బ్రళయమెదురు
చూచుచుండునుభూతిమూల్ చూచుచుండు, లోకమును మ్రింగఁజూచును లోకమెపుడు

గీ. ఏడువందలపదునాఱు మృత్యువు యమ, కాలదుష్కార్యములు జగజ్జాలమును భు
జింప వక్త్రంబుదెఱవి కాంక్షించికొనియు, సిద్ధముగనుండుటను దెలిసికొనవగును.

గీ. ఏడువందలపదునేఁడిదేమిలెక్క, ప్రాణులు భుజించుఁబ్రాణుల రైలుమొదలు
నోరులేనిజంతువులు నాహారమునకుఁ, గడఁగినవి తిండిలో నిదిగాదె వింత. ౭౧౭

గీ. ఏడువందలపదునెన్మి దేఱు చెఱువు, బావి యిట్టివి యత్తల బారినుండి
తొలఁచి యొలయించి పతులకౌఁగిళులకెడపి, తెచ్చి కోడండ్రమెసవు నత్తిపియేమొ

గీ. ఏడువందలపందొమ్మి దేమియముఁడు, ప్రాణులను జంపితినక యల్పముగ నెంపొ
డాఁగియుండిన జీవు దృఢంబుగాఁగ, నతినిశితపాశబద్ధుఁజేసి తిగియంగ. ౭౧౯

గీ. ఏడువందలయిరువది యిట్టివెట్టు, లను గనియె యెంతయొడలున్న లక్ష్యపెట్ట
కీఁగ చీమయు దోమయు నేర్చికొనియె, ప్రాలఁ గుట్టఁగ రతిసేయ వలయునెడలు.

గీ. ఏడువందలమీఁదట నిరువదొక్కఁ, డెల్ల వర్జించి యడవిలో ఋషులు ప్రాణి
కోటి కాధార మగుగాలిఁ గ్రోలుచుంట, నుప్పవులుసును దానియం దున్నకతన.

